ఫోన్: 2066 టెలిగ్రామ్: హిందీసంఘ్
సంపుటి 6 సంచిక 4

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకులు
వేమూరి ఆంజనేయశర్మ
సి. నారాయణరెడ్డి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర
6-2-959, ఖైరతాబాదు — హైద్రాబాదు - 4.

సంవత్సర చందా రు. 3-0-0 | జులై, 1959 | విడిప్రతి రు. 0-4-0

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

# ఈ సంచికలో

సంపాదకీయము
యువత (కవిత) శ్రీ దాశరథి
ఫుట్‌పాత్ (కథానిక) శ్రీ యం. హీరాలాల్ రాయ్
లోకచరిత్ర (గేయం) శ్రీ వసంతరావు రామకృష్ణరావు
మెఱవణి గద్య శ్రీ తూమాటి దొణప్ప
రూపక సమాలోచనము శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ
ఇంద్రధనస్సు (గేయం) శ్రీ మాదిరాజు రంగారావు
కుమారసంభవము - దృశ్యనిర్మాణ శిల్పము (వ్యాసం)
శ్రీ యస్. బాపిరెడ్డి
శతపత్త్రము (కవిత) శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి
అధ్యక్షోపన్యాసం _ 20 వ ఆంధ్రప్రదేశ హిందీ ప్రచారక సమ్మేళనం
పద్మశ్రీ మోటూరి సత్యనారాయణ
పిప్పృచ్ఛ శ్రీ వంగల పార్థసారథి ఆచార్యా
పుస్తక సమీక్ష

ముఖచిత్రం : వాద్యగోష్ఠి - అమరావతి

గమనిక : మార్చి జయంతిలో ప్రచురించబడిన 'దేవీనవతి' సమీక్ష మే నెల స్రవంతి పత్రికలో ప్రచురించబడినట్లు జూన్ నెల జయంతి పత్రికలో వివరించబడినది. స్రవంతి, జయంతి రెండు పత్రికలూ ఒకే ప్రెస్‌లో అచ్చవుతున్నవి. జయంతిలో ప్రచురించబడిన సమీక్ష వ్రాతప్రతి ప్రెస్‌లో స్రవంతి ఫైలులో చేరడంవలన ఈ పొరపాటు జరిగినది. అందుకు విచారిస్తున్నాము. అయినా ఇటువంటి చిన్న విషయాలను పత్రికాముఖమున గాక ఉత్తరప్రత్యుత్తరముల ద్వారా సరిచేసుకొనవచ్చునను కొంటాము.

—సంపాదకులు

*సంపాదకీయం :*

# రాజభాష - హిందీ

పార్లమెంటరీ హిందీ కమిటీ నివేదికను గురించి ఇదివరకే వివరంగా చర్చించి ఉన్నాము. మనదేశంలో ఇతర సమస్యలతోబాటు భాషా సమస్య కూడా ఒక జటిలమైన సమస్యగా తయారవుతూ ఉన్నది. రాజభాష స్వరూపం, ప్రాంతీయ భాషలు రాజభాషకుగల పరస్పరసంబంధం, ప్రభుత్వ కార్యకలాపాలలో రాజభాషకు కలగనున్న ప్రాముఖ్యత వీనిని ముందుగా స్పష్టంగా అర్థంచేసుకొని వ్యవహరిస్తేనేగాని ఈ సమస్యలకు పరిష్కార మార్గం దొరకదు. ఇంగ్లీషువారు పరిపాలించినంతకాలం మనదేశంలో ఇంగ్లీషు రాజభాషగా ఉండడం వలన ప్రాంతీయ భాషలు ఏవీ ప్రభుత్వ రంగంలో అభివృద్ధికి రాలేదు. ఇంగ్లీషు భాష ప్రాంతీయ భాషలన్నింటినీ అణచివేసిందని చాలమంది పెద్దలు ఇప్పటికినీ భావిస్తూనే ఉన్నారు. స్వాతంత్ర్యం లభించినతరువాత మనం ఒక రాజ్యాంగ చట్టాన్ని నిర్మించుకొని దానిలో హిందీ మన రాజభాష కాగలదని నిర్ణయించుకొన్నాము. ప్రస్తుతం ఇంగ్లీషుకున్న స్థానమే హిందీకి లభిస్తుందనీ, అటు ప్రాంతాలలోనూ ఇటు కేంద్ర ప్రభుత్వ కార్యకలాపాలలోనూ హిందీ భాషకు ప్రాముఖ్యత లభించగలదనీ అది మంచిదికాదనీ చాలా మంది సందేహపడుతున్నారు. నిజానికి రాజ్యాంగ చట్టం ఆశించినది అది కాదు. ప్రాంతీయ ప్రభుత్వాలలో ప్రాదేశిక భాషలూ, అంతర్రాంతీయ వ్యవహారాలలోనూ, కేంద్ర ప్రభుత్వ కార్యకలాపాలలోనూ ముఖ్యంగా హిందీ అమలులోనికి రాగలదు. ప్రస్తుతం ఇంగ్లీషు కేంద్రప్రభుత్వంలోనూ ప్రాంతీయ ప్రభుత్వాలలోనూ ఏకాధిపత్యాన్ని వహించి ఉన్నది. ఆ స్థితి ఎక్కువకాలం వరకు ఉండుట దేశహితానికి మంచిదికాదు. ఇంగ్లీషు శక్తివంతమైన భాష అనీ, చాలాకాలంనుండి ప్రభుత్వ యంత్రాంగంలో ఉపయోగపడుతున్న భాష అనీ, కనుక దానిని తొలగించివేయడం ఉత్తమం కాదనీ ప్రముఖులు కొంతమంది వాదిస్తున్నారు. ఏనాటికైనా ప్రాంతీయ

భాషలకూ హిందీకి తగిన ప్రోత్సాహం లభించి అవి శక్తివంతమైన భాషలుగా అభివృద్ధి పొందితీరక తప్పదు. చిరకాలంవరకు ఇంగ్లీషు మనకు రాజభాషగా ఉండడం జరిగే పనికాదు. ప్రజాస్వామ్య విధానంలో ప్రజలందరికీ అందుబాటులోనున్న భాషలలోనే రాజ్యాంగమంతా జరగవలెనే గాని ఏ కొద్దిమందికి మాత్రమో తెలిసిన భాషలో రాజ్య కార్య నిర్వహణ జరుగుటకు వీలులేదు అందువల్లనే మన పెద్దలు ప్రాంతీయభాషలకూ రాజభాషకూగల పరస్పర సంబంధాన్నీ, అవి ఉపయోగింపబడవలసిన రంగాలనూ స్పష్టపరచి ఉన్నారు. రాజభాష యగు హిందీని అభివృద్ధి పరచుటలో కేంద్ర ప్రభుత్వం వారికి ఎంత బాధ్యత ఉన్నదో ప్రాంతీయ ప్రభుత్వాలకు గూడా అంతే బాధ్యత ఉన్నది. అదేవిధంగా ప్రాంతీయ భాషలను అభివృద్ధిపరచడంలో కేంద్రానికి కూడా సంపూర్ణమైన బాధ్యత ఉన్నది. ఈ విషయాన్ని కేంద్ర ప్రభుత్వం వారు ఇప్పుడిప్పుడే గమనించి ప్రాంతీయ భాషల వికాసానికి కూడా తగిన కృషిని ప్రారంభించారు. అందుకు వారు అభినందనీయులు. ప్రాంతీయ భాషల వికాసంతోబాటు రాజభాష అగు హిందీ కూడా వికాసం పొంది అచిరకాలంలోనే పరిపుష్టమైన భారత రాజభాషగా పెంపొందగలదని విశ్వసిస్తున్నాము. భారతీయ భాషలు శక్తివంతమైనవి కానంతకాలం ఇంగ్లీషును కూడా మనం అనుసరించవచ్చును. అందువల్ల ప్రమాదమేమీ లేదు.



కవిత :

# యువత

శ్రీ దాశరథి

కవిత లేకయున్న యువత శూన్యంబౌను
యువత లేకయున్న నవత సున్న
నవత లేకయున్న నాగరకత లేదు
నాగరకత లేక నాడు లేదు.

యువత కానిపించు నున్మత్తవార్షుక
మేఘపం క్తియందు మింటిలోన,
యువత తొంగిచూచు నవశరచ్చంద్రాత
పంబు ప్రతిఫలించు వాగులోన.

మల్లెపూవువోలె మనసు విప్పారిన,
పరిమళమ్ము వోలె కురియు యువత;
నదిజలమ్మువోలె హృదయ ముప్పొంగిన
తరగలట్లు యువత తాండవించు.

కుట్రలేనిమనసు, కుత్సితమ్మెరుగని
యెడదలోన యువత ఇవతళించు
తెల్లబడినకురుల నల్లని వర్ణమ్ము
వైచినంత యువత వచ్చిపడునె.

వృద్ధుడైనగాని పిన్నవాడైనను
త్యాగశక్తి యున్న తనరు యువత,
త్యాగబుద్ధిలేని తరుణుండు తరుణుడే
వృద్ధిలేని ముసలిముద్ద గాక.

కదలిరండు నేడె గహనాలు గగనాలు
దాటి, నవపతాక నాటి, చంద్ర
కుజ, శని గ్రహాది గోళాలు దరిసింప,
అచట మానవత్వ మంకురింప.



కథానిక :

# ఫుట్ పాత్

— శ్రీ యం. హీరాలాల్ రాయ్

ఆ ప్రదేశంలో 'ఫుట్ పాత్' మీద అతను ప్రతిరోజూ నాకు కనిపిస్తూండేవాడు. ఎన్నో పగళ్ళూ, ఎన్నో రాత్రులూ, కాంతివంతంగానూ, నికృష్టనీలంగానూ అసంఖ్యాకంగా గడిచి పోయాయి. ఎన్నో మార్పులు ఏర్పడ్డాయి. కాని, అతన్నెప్పుడూ అక్కడే నేను చూస్తూండే వాణ్ణి. కష్టాలమూలంగా వచ్చిపడే విషాద ఛ్ఛాయలుగానీ, దుఃఖపుతెరలుగానీ అతని ముఖంలో ఎన్నడూ కనపడ్లేదు నాకు. ఎప్పుడూ చాలా ప్రశాంతంగా, ముఖంలో వర్చస్సుండేది.

కొన్నాళ్లనుంచీ నన్ను చూడగానే 'నమస్కారం' చేయడం ప్రారంభించాడు. యథాలాపంగా నేను స్వీకరిస్తూండేవాణ్ణి. కాని, అతనిదొక అలవాటుగా, నిత్యకృత్యంగా మారడంతో, అతన్నిగురించి నేను శ్రద్ధగా ఆలోచించవలసిన అవసరం కలిగింది. ఒకనాడు "నీ పేరేమిటి ?" అని అడిగాను.

"నాపేరు 'రాజా' అండీ" అన్నాడు వినయం ప్రదర్శిస్తూ.

"యెక్కడ నీ రాజరికం ?" అన్నాను కొంచెం చనువుతోకూడిన పరిహాసంగా.

"యిక్కడే" నన్నాడు నిర్భయంగా.

"అయితే మరి నీ యిల్లెక్కడ?" అన్నాను కుతూహలంగా.

"యీ ఫుట్ పాతే నాయిల్లు ప్రస్తుతం" అన్నాడతను.

"ఇక్కడే యీ వీథిలో, ఈ భూమ్మీదే పడుకుంటావేమిటి ?" యీమాటు కొంచెం ఆశ్చర్యంగానే ప్రశ్నించాను.

"అవునుబాబూ ! ఇందులో నేను బిడియ పడవలసిందేముంది చెప్పండి ? ఈ భూదేవి గుండెల్లోనే పుట్టాము. యిక్కడే పెరిగాం.... చచ్చాక మళ్ళీ ఈతల్లి గుండెల్లోనే దాక్కుంటాం. అలాంటప్పుడు, దీనిమీద నివసించటానికి అభ్యంతరం యేమిటంటారు....?" అన్నాడు సాలోచనగా, అమాయకంగా.

అతని ప్రసంగం నాకింకా వినబుద్ధైందుకో. ........తిరిగి ప్రశ్నించాను. "నీ కిక్కడేమీ కష్టంగానూ, అసౌకర్యంగానూ వుండదా ?" అని.

"కష్టం, అసౌకర్యం, బాధ ఎలావుంటాయో యింతవరకూ నేనెరగను. మనముందు కనిపించే యీ పెద్దపెద్దమేడలున్నాయి చూడండి! వీటిపట్ల నాకెంత అభిమానంవుందో, యీ ఫుట్ పాతన్నా అంతకుమించిన మమకారం వుంది. యీ మమకారం యిప్పుడు 'ప్రణయం' లో కూడా మారుతోంది. ప్రతిరోజూ ఎంతమంది ఐశ్వర్యవంతులూ, మహామహులూ, మంచి అందాలుచిందే సుందరాంగులూ, నిర్భాగ్యులూ, దౌర్భాగ్యులూ, కురూపులూ లెక్కలేనంతమంది యీఫుట్ పాత్ ప్రక్కగానూ, పైగానూ వెళ్ళుతూంటారు. నేనూ దీనిమీద నడుస్తూంటాను. రాత్రిళ్లు నిద్రిస్తూంటానుకూడా. అందరూ దీనిమీంచి నడవడమేకాని, నేను నిద్రకూడా యిక్కడే పోతూ, అందరికన్నా మరో పని అధికంగా చేస్తూంటాను. నేనేకాక యింకా వందలమంది నాతోపాటు యిక్కడ నిద్రించే

వాళ్ళున్నారు. వీళ్ళల్లో ఆడా మగా కలగా పులగం. మాంచి చలాకీగా అందమైన పడుచులూ, పట్టు సళ్ళని బిగింపుగల అబ్బాయిలూ, బొమికల పోగుల్లాంటి యవ్వన శరీరాలూ, దగ్గు, ఆయాసంతో కుళ్ళే జీవితాలూ యెన్నో రకరకాలు యిక్కడ కనిపిస్తాయిలెండి. జీవితం ఉత్సాహంగా గడిచిపోవడానికి అవసరమైన సరంజామా అంతా యిక్కడ లభ్యమవుతూనే వుంటుంది" అన్నాడతను నా ముఖం తదేకంగా చూస్తూ.

అతని ధోరణీ, ఉల్లాసం చూస్తున్నకొద్దీ అతను మాట్లాడుతూంటే యింకా వినాలనిపించింది. ప్రథమ సమావేశంలోనే అతను విచిత్రవ్యక్తిగానూ కనిపించాడు. నేను నిజంగానే నా కుతూహలాన్ని ప్రదర్శిస్తూ "ఫుట్‌పాత్ రాజ్యంలో ప్రణయాలూ, ప్రేమలూ, మంచి రసవత్తర దృశ్యాలుకూడా వుంటాయన్నమాట !" అన్నాను.

"ఆ ! ఆ ! ఎందుకుండవూ ? రసవత్తరంగానే వుంటాయికాని, రసంలో కొంచెం బాహ్యాకర్షణ మాధుర్యం తరుగుపాలలో వుంటుంది. ఇక్కడ జార్జెట్ సిల్కుచీరెలూ, బ్లౌజులూ, స్నో పౌడర్లూ, రెండేసిజడలూ, స్లిప్పర్లూ కనిపించవు. ఇక్కడ నివసించే అమ్మాయిలు సువాసన ద్రవ్యాలూ, అత్తర్లూ వాడరు. యేవన్నా అవసరాలు కలిగి, ఆవేళ అలాత్రోసుకవస్తూంటేతప్ప వాటిని వాడరు. వీళ్ళ జీవితాలేమంత తక్కువ విచిత్రమైనవి కావు. వీళ్ళుకూడా యెవర్నో ప్రేమిస్తూ వుంటారు. ప్రతీక్షిస్తూవుంటారు. ప్రేమగీతాలు వల్లిస్తూ వుంటారు. కాని........ఈ స్థాయి వేరు.—ఈ ఫుట్‌పాత్‌మీద అసంఖ్యాకమైన గాథలు వుద్భవిస్తూంటాయి. కొన్ని జన్మించగానే నిరవశేషమైపోతాయి. మరికొన్ని అప్పుడప్పుడూ పేర్కొనవలసిన ఉందంతాలుగా కూడా పరిణామం చెందుతాయి. అమాయక హృదయాలతోవుండే ఆరంభ యువతీమణులు తరుచుగా ప్రణయ పూజలూ, ప్రియారాధనలూ చేస్తూ ప్రాణాలుకూడా విడిచేస్తూంటారు. కాని యివి త్యాగం అనే బిరుదును తాల్చవు. వీళ్ళ ప్రణయం వీళ్ళతోనే ఆఖరవుతుందికాని చరిత్రలో నిలవదు.

"ఇక్కడ మా యెదురుంగా ఖూనీలు అవుతూంటాయి. ఎంతోమంది మాన మర్యాదలు దోపిడీ అవుతూంటాయి. ఇవన్నీ మేం తమాషాగా చూస్తూంటాం. నేరస్థులు, హత్యాకారుల గుంపులు కూడా యీ ఫుట్‌పాత్ మీంచే నడుస్తూంటాయి.........జనం అప్పుడప్పుడూ వీరిలో కొందరికి పూలదండలువేసి ఊరేగించి గౌరవిస్తూంటారు....అంతాగమ్మత్తుసుమండీ !....మరోమాట....ఈ హత్యలూ, ఖూనీల సందర్భంలో ఒక్కోసారి యీ ఫుట్‌పాత్ మీద నిద్రించే వారు హఠాత్తుగా నిర్బంధింపబడి, నడుముకి తాడుకట్టి, శవాలని లాక్కెళ్ళినట్టు లాక్కెళ్ళబడుతూంటారు.... అదీ తమాషాగానే మాకళ్ళకి కనిపిస్తుంది."

సాగిపోతూనేవుంది రాజా ధోరణి. అతని మనస్తత్వం ఎలాంటిదో అంచనా కట్టలేక నేను ఉక్కిరి బిక్కిరవుతున్నాను. కాని యీ అవస్థ యింకా కొనసాగితేనే బావుండుననిపిస్తోంది. అతను కొంచెంవిశ్రాంతితీసుకొని మళ్ళీ ప్రారంభించాడు.

"ఇదిగో ఈ ప్రక్క రెండంతస్తుల బంగళా వుంది చూశారూ అదో జమిందారుగారిది. వారి అమ్మాయి పెళ్ళి నిన్న....యీ అమ్మాయినే యిప్పటికి రెండురోజుల క్రితం మరోరితో ప్రేమ సయ్యాటలాడుతూండగా నేను కళ్ళారా చూచాను. తప్పక వివాహం చేసు

కుంటానని వాగ్దానం యివ్వటంకూడా నేను చెవులారా విన్నాను. నిన్న మరో జమీందారు గారి అబ్బాయికి ఆవిడ పెళ్ళికూతురై కూర్చుంది." అన్నాడు కొంచెం విరక్తిగా.

అర్ధరాత్రిళ్ళు చీకటిలో యీ ఫుట్‌పాత్‌ల మీద జరగని అంశమంటూ యేముందిబాబూ! అవన్నీ వింటే నీళ్ళుకారి చల్లబడిపోతారు. అన్నిరకాల గాథలనీ తమలో లయంచేసుకొని గంభీర మౌనంతోవుండే యీ కాలిబాటలు నిజంగా యెంతో దయగలవి. ఎన్నోతప్పులనీ, నేరాలనీ యివి తమ గుండెల్లో రహస్యంగా దాచి వుంచుకుంటాయి. ఇవన్నీ వెల్లడిచేస్తూ వల్లించడం ప్రారంభిస్తే, మీరు నన్ను అసహ్యించుకుంటారు. నన్ను ఒకళ్ళు అసహ్యించుకోవడం యేమాత్రం నాకిష్టంలేదు. మంది నిరసనకి గురిఅయితే జీవితం బహు భారం అవుతుంది. అందుకని నా హృదయాన్నికూడా యీ ఫుట్‌పాత్‌లానే తయారు చేశాను. అన్నీ యిందులో యింకిపోతాయి బయటపడకుండా.

"యీ ఫుట్‌పాత్ చాలా క్రూరమైందీ, అమాయకమైంది కూడానూ. జీవితం వెళ్ళదీయటాని కింతకన్నా మంచిజాగా యెక్కడ లభిస్తుంది? యిప్పటి మనుషుల బ్రతుకుల్లోని సహజ పరిస్థితులూ, వాటిస్థాయి, వున్నది వున్నట్టు యిక్కడే కనిపిస్తుంది. బ్రతికున్నంత వరకూ దీన్ని విడిచిపెట్టలేనంత వ్యామోహం నాకు."

"నీవొక తత్త్వవేత్తలా మాట్లాడుతున్నావే?" అన్నాను నేను.

"మనిషికి తత్త్వాన్నీ, వేదాంతాన్నీ యిదే బోధించి తయారుచేస్తుంది బాబూ" అన్నాడు 'రాజా'....కొద్దిగా నిట్టూర్చి మళ్ళీ ప్రారంభించాడు.

"దీనికోసం నేనెవడికీ పైసా పన్ను కట్ట నవసరంలేదు. దీన్ని శుభ్రం చేయవలసిన బాధ్యత అంతకన్నాలేదు. దీన్ని సంరక్షించి కాపాడాల్సిన పని నాదికాదు. యిదంతా ఆ చౌకీదార్లే చూసుకుంటారు. అప్పుడప్పుడూ యేదో మాకు తోచిందిమట్టుకు వాళ్ళకు ముట్ట చెబుతూంటాం. మగవాళ్ళమైతే యేవో నాలుగు చిల్లరడబ్బులు....ఆడవాళ్ళైతే యేదో కాస్సేపు కన్ను మూసుకోవటం....గప్....చిప్....యీ పెద్దపెద్ద దుకాణాలూ, షాపుల రక్షణతో పాటు మా రక్షణ బాధ్యతకూడా యీ చౌకీదార్లదే. యిక మాకేం భయం? మీరేచెప్పండి" అని ప్రశ్నార్థకంగా నావైపు చూశాడు.

అతనితో మాట్లాడుతూంటే ఒక వింత ఉద్వేగం ముఖంలో కనిపిస్తూన్నది. చాలానిబ్బరంగా చెప్పుకుపోతూన్నాడు. ఇంతలో యేదో సన్నటి స్త్రీకంఠం అతణ్ణిపిలిచింది పక్కసందులోంచి. అతను కొంచెం బిగ్గరగా "వస్తున్నా! వస్తున్నా! వుండు" అన్నాడు.

"ఎవరావిడ నిన్నుపిలుస్తోంది?" అన్నాను.

"ఆవిడ 'గంగారాణి' బాబూ! 'గంగారాణి'. అవిడ నన్ను ప్రేమిస్తోందిప్పుడు.... తనో పెద్ద అందగత్తె ననుకొంటుంది. నాకు ప్రతిరోజూ రకరకాల మిఠాయీలు తెచ్చి పెడుతూంటుంది....మంచి ప్రేమగా మాట్లాడుతుంది.... పాపం ఇటీవలే పెద్దదయింది.... అది ఆవిడ తప్పా? యిప్పుడు ఆవిడకి ప్రేమ జబ్బు బాగాపట్టుకుంది.... యేం చేద్దాం....?

"అప్పుడప్పుడు కొన్నిరోజులు నేను భోజనం లేకుండానే గడుపుతూంటాను. యేదో దొరికినప్పు డింత తింటూ, కులాసాగా జీవితం గడుపుతూంటాను. యేదన్నా కూలిపని దొరికి నాలుగుడబ్బులున్ననాడు కడుపునిండా సుష్టుగా తినాల్సివస్తుంది. కాని యీ గంగారాణివుంది

చూశారా ?.... యిది ప్రతిరోజూ మధురాతి మధురమైన ఫలహారాలు తెస్తుంది.... యివి తింటూంటే శరీరంలో కొత్తసంచలనం కలుగుతుంది.... నేను గనుక ఆవిడతో ప్రేమగా మాట్లాడకపోతే, నాకీ పదార్థా లెక్కణ్ణించి వస్తాయి మరి ? అందుకే యేదో ఆవిడ కోరినట్లల్లా చేస్తూంటాను. పొట్టకోసం దేవులాట బాబూ ! యిది అన్నీ చేయిస్తుంది.... యీ రకం ప్రేమంటే నాకు చెడ్డచిరాకే. యీ లోకంవుండే యిది భలే చురుకైంది.... శారీరకమైన కోరికలు తీర్చుకోవడాన్ని యిది 'ప్రేమ' అంటుంది. యిక్కడ తప్పులన్నిటికీ మంచిమంచి మారుపేర్లున్నాయి.... మగవాడి కన్న ఆడదే యెక్కువగా పరిస్థితులకు గురి అవుతుంది. యీ గంగారాణినే చూడండి ! యిది పెద్దదై యెంతోకాలం కాలేదు.... అప్పుడే రంగులు మారుస్తోంది.... ఆడదాని మనస్తత్వం చిత్రమైంది..... ప్రేమతో మాట్లాడి, అందాన్ని వర్ణిస్తూ దగ్గరకు తీసుకుంటే, వాళ్ళకోసం ప్రాణంకూడా తీసుకుంటామంటారు. యెప్పుడూ అతనికోసం నిరీక్షిస్తూ కళ్ళు మూతలు పడనీయరు. ప్రియుడికి పెట్టందే చస్తే వాళ్ళు తినరు.... చిత్రంకాదూ యిదంతా ? యీ పదార్థాలన్నీ నీకెక్కణ్ణించి వస్తున్నాయని గంగారాణిని నేనడిగితే, ఒయ్యారంగా కిలకిలమంటూ నవ్వి కొంచెం కన్నుగిలుపుతూ "ఎక్కణ్ణించి తెస్తే నీకేం ? పెట్టినప్పుడు తినరాదూ ?" అంటుంది.... ఆవిడ అలా కన్నుగిలపడం నాకు పరమ అసహ్యంగా వుంటుంది.... ఇంకా యిలాగే ఎన్నో చిత్రచిత్రమైన పనులు చేస్తూంటుంది.... దాదాపు ఒక్క సంవత్సరం క్రిందటివరకూ దీనికి బిచ్చమెత్తుకోవటం కూడా చాతకాకపోయేది. వట్టి పిచ్చిదానిలావుండేది. అప్పటికీ యిప్పటికీ దీనిపరిస్థితిలో భూమికీ ఆకాశానికీ వున్నంత తేడా వచ్చింది. నేను తనను గాఢంగా ప్రేమిస్తున్నాననీ, మెచ్చుకుంటున్నాననీ అనుకుంటుంది. నేనుమాత్రం దీన్నొక జబ్బుక్రింద లెక్క వేస్తాను. ప్రేమించడమనేది జబ్బేకాదు. దెబ్బకూడా. పేదవాళ్ళూ, భాగ్యవంతులూ, అంతా యిక్కడ యీ 'ప్రేమ' వెంట పరుగెడుతూ కనిపిస్తూంటారు. 'గంగారాణి' తనని మార్కెట్లో అమ్ముకొని, మంచి మధుర పదార్థాలు తెచ్చుకుంటుంది....తనని మరొకళ్ళ కిచ్చుకొని, ఆ మూల్యంతో నన్ను కొనాలని చూస్తుంది. ఒక్క సంవత్సరంలో దీని పిచ్చితనం అంతా మాయమైపోయింది. దాంతోపాటు సిగ్గునుకూడా విడిచిపెట్టింది.... కనురెప్పలక్రింద. లాలించడానికి వచ్చి పిలుస్తోంది. యిదంటే నాకు అసహ్యమే. కాని మిఠాయిలు మంచి రుచిగా వుంటాయి.... తింటాను. సరే బాబూ ! మిమ్మల్ని చాలా సేపు విసిగించాను. క్షమించండి. మళ్ళీ రేపు కలుసుకుందాం. నమస్కారం!" అంటూ వెనుదిరిగి చూడకుండా చరచరా సందులోకి వెళ్ళిపోయాడతను.

ఫుట్ పాత్ జీవితాలను గురించి ఆలోచిస్తూ నేను యింటిముఖం పట్టాను. వీళ్ళవి నిజంగా చిత్రమైన బ్రతుకులు. యిదొక చిత్రమైన క్రొత్త ప్రపంచం. కనీసం నెలకోమాటైనా వీళ్లు స్నానం చేస్తారా అని .. ? కట్టుకోవడానికి బట్టలుకూడా వుండవు. బ్రతుకులో యేసుఖమూలేదు. అయినా యిక్కడకూడా ప్రేమకలాపాలు నడుస్తూనే వుంటాయి. ప్రతీక్షలు జరుగుతూనే ఉంటాయి. ప్రియులకి ఆదర సత్కారాలు లభిస్తూనే వుంటాయి. బలేబతుకులు- వీళ్ళ అదృష్టం మారటం కానీ, వీళ్ళకి వసతి సౌకర్యాలూ, ఇండ్లూ ఏర్పడడం



కానీ, బహుశా శతాబ్దంలో సాధ్యపడవేమో ?

మర్నాడు అదేచోట మళ్ళీ 'రాజా' కనిపించాడు. మంచి హుషారుగా చిరునవ్వుతో శుభ్రమైన దుస్తుల్లో వున్నాడు. వుండబట్టలేక ప్రశ్నించాను, యేం 'రాజా' చాలా ఉత్సాహంగా వున్నావే ఇవాళ ? అని.

"అవునుబాబూ! సంతోషంగానే వున్నాను. గంగారాణి సిఫారసుతో నాకో చిన్న ఉద్యోగం దొరికింది. ఉద్యోగంబాపతు వివరాలు మీరు నన్నడక్కుండా వుండటం మంచిది. ఆవిడ చెప్పిన ఉపాయంతో నేనుకూడా అమ్ముడు పోవడం నేర్చుకున్నానుబాబూ ! తియ్యటి పదార్థాలు, కొంచెం మెత్తని పడక 'నేతి చపాతీ'లు, 'ఆమ్లెట్లు' ఇవన్నీ అనుభవించాలని యెందుకనిపించదు చెప్పండి. దానికిఇంతకన్నా మార్గం యేముంది ? సరే బాబూ ! అదిగో ఆ బంగ్లాలో నాకోసం యెదురుచూస్తుంటారు. ఎప్పుడన్నా వీలుపడితే నేనే మిమ్మల్ని తప్పక కలుసుకుంటూ వుంటానులెండి." అంటూ హడావిడిగా నిష్క్రమించాడు.

ఆలోచిస్తూ ముందుకు నడిచాను. "బ్రతుకు గడపడానికి ఒకడు మరొకడికి బానిసగా అమ్ముడు పోవాలా ?" అనే ప్రశ్న నన్ను వేధిస్తోంది.

రాజా మరొకసారి కలిసి ఇలా అన్నాడు. "ప్రస్తుతం నేను 'ఫుట్‌పాత్'ని వదిలేశా ననుకోండి. కాని మమకారంమాత్రం త్రెంచుకోలేదు. మళ్ళీ యెప్పుడో ఒకనాడు యిక్కడికి రావటం తప్పకపోవచ్చు. నేనిక్కడే పుట్టాను కదా ?" అంటూ ఒకమాదిరిగా నవ్వుతూ వెళ్ళిపోయాడు. బహుశా మిఠాయి తినడానికీ, తనని తను అమ్ముకొని మెత్తని పడకమీద ఒత్తిగిల్లి సుఖపడడానికీ కావచ్చు.



గేయం :

# లోకచరిత్ర

— శ్రీ వసంతరావు రామకృష్ణరావు

గతానేక సంఘటనలనుండి సముత్పన్నమైన
శతాబ్దాల చరిత్ర విషయాల బృహత్సంపుటాలు
నితాంత నిశాంత నవ్యజీవన సందేశమిస్తున్నవి !
వితాకుపడిన మానవుని జీవితపథాన నిరాశా
ప్రతీపమై విస్మృతచరిత్రలు ధరిత్రిలో నిలుస్తవి !

ఏ చరిత్ర సంపుటపు పుటలు తిరుగవేసినా
రాచరికపు తళుకు బంగారు సంకెలల యుగం !
ప్రాచుర్యంవహించినట్లు తెలుస్తుంది ! జనత
ఊచమట్టుగా ఆశృంఖలాలు ఛేదించి, ర
సోచితంగా, సాహిత్యం, సంగీతం, శిల్పం
యోచనతో, ప్రగతిసంస్కృతిని సాధించినది !

శతశతాబ్దాల చరిత్ర సంపుటాలు
క్షతమైనా - గతమైనా - విస్మృతమైనా
ఇతిహాసాలూ, శ్రుతులూ, చ్యుతమైనా -
గతితప్పని కవి విశాలదృష్టిని, నిరతమూ
నీతులనూ, మహోన్నతులనూ, ఒకేత్రాటిపై
అతులితముగా జతచేసి, సమాదరణముతో
క్షితిజరేఖదిక్కుగా పయనింపచేసినది !
వితతమైన లోకచరిత్రనే వ్రాసినది !

ఏదీ ! లోకములో వేరొకటేమీ
లేదే ? రాదేమీ వినూతనదృష్టి !
రాదేమీ ? ఇంకా నవజీవికకు వృష్టి !
పోదేమీ ? సంకుచితపాత్రలసృష్టి !
అదిగో .... విచ్చెను కవిక్రాంతదృష్టి; సంసృష్టి
ఇదిగో — వచ్చెను ప్రగతిభరిత శాంతివృష్టి.

# మెఱవణిగద్య

— శ్రీ తూమాటి దొణప్ప

తలంబ్రాలయిన తరువాత నవవధూవరులు మెఱవణి బండిమీఁద రాత్రిపూట ఊరేఁగునపుడు వాయిదగాండ్ర నాయకుఁడు ఇరువంక పెండ్లిచుట్టములపై చదువు గద్యను మెరివిణిగెద్ది-మెఱవణిగద్య-అని యందురు. పొగడింపులు, పొగడింపుల గెద్ది యనియు కొన్ని యూళ్ళ వాడుక. వరుసపాటలవలె పెండ్లి పరిహాసములలో ఇదియొక భాగము. క్రిందటి దినములలోపల పెండ్లి యనఁగా అయిదునాళ్ళ వేడుక. మొదటినాఁడు నిబ్బణము ; ఇదే ఎదురుకోలు. ఈ రాత్రే తొలిబువ్వము. రెండవనాఁడు తలంబ్రాలు. మూఁడవనాఁడు ఊరేఁగింపు. నాలుగవనాఁడు నాగవల్లి. నాగవల్లినాఁటి రాత్రే బువ్వముబంతి. బువ్వముబంతి హరిబువ్వమనియు వ్యవహృతము. బువ్వముబంతి సరసములొక ప్రత్యేకశాఖ. అయిదవనాఁడు ఇల్లింపుల-తిరిగింపుల - అంపకాలు. మూఁడవనాఁటి ఊరేఁగింపు టుత్సవములో చదువునదీ మెఱవణి గద్య. ఆనాఁటి అయిదునాళ్ళ పెండ్లి ఈనాఁడు ఒకనాఁటి పెండ్లికి దిగినది. పూర్వాచారములపయి అంతో ఇంతో ప్రీతి యున్నవారు కొందఱు తలంబ్రాలనాఁటి రాత్రే ఒక తీరుగా ఊరేఁగింపును అయిన దనిపింతురు. అనాగరక లక్షణమని తెనుఁగు మీఱినవారు చాలమంది మెరవణిని బొత్తిగా మానివేసినారు. ఆ మూఁడు ముడులును పడుట తరువాయి ఉభయవిధ బాంధవులును పెండ్లివిందులో మూఁడు మెదుకులను ముక్కున అదికించికొని అదరబాదర తరలిపోవుదురు. 'నాగవల్లి నిష్ఠూరము' నామమాత్రముగా మిగిలినది. క్షణము తీఱిక చిక్కని నవనాగరకతయును, పెండ్లిపెద్దల పొదుపు ఉద్యమమును ఈ కక్కుఱితి కల్యాణ కార్యక్రమములకు కారణములు. నేఁడు అయిదునాళ్ళ పెండ్లి అపురూపము.

శుభాశుభకార్య సందర్భములలో మేళగాండ్రు - వాద్యవాదకులు - నూటికి తొంబదిపాళ్లు అంగారకులు. మంగలి యనుమాట శుభప్రదము కాదని మంత్రులు, బజంత్రీలు, అంగారకులు, కల్యాణకులమువారు అని వీరిని వ్యవహరింతురు. ఇవియును హీనస్థితి ద్యోతకములని కాఁబోలు వీరీ నడుమ నాయీ బ్రాహ్మణులను నవీన నామమును ధరించుచున్నారు. 'ఓజు' అనునది ఒకప్పుడు వీరి బిరుద

నామము. పంచాణమువారితోపాటు ఈ కులమువారికిని 'ఓజు' బిరుద నామముగా విజయనగరకాలపు శాసనములలో ప్రయుక్తము. మంత్రులకన్నను మంచివాఁడని పేరుపొందిన మంగలి కొండోజు కృష్ణరాయలనాఁటి వాఁడని ఒక చాటువు. వీరిలో లింగాయతమతమునఁ జేరినవారు మద్యమాంసాదులను విసర్జించి సనాతన ధర్మపరాయణులుగా వర్తించుచున్నను కులవృత్తిని మాత్రము మానలేదు. దిన దినము ఒకపూట కులవృత్తి నిర్వహణము. రారాజు రమ్మన్నను రెండవపూట పొదిని ముట్టరు. వైద్యము, వాద్యవాదనము వీరి ఉపవృత్తులు. ఏఁడాది పొడుగు నను ప్రధానవృత్తిని నిర్వహించుచు, పనిబడినపుడు వాద్యవాదనమును చేపట్టుదురు. వీరు కాక అసాది, కొరిచె తెగలవారును ఈ వాదకవృత్తిని స్వీకరించినవారు. వారి కిది కులవిద్య కాదు; కూటి విద్య. కొరిచెలలో బజంత్రీ కొరిచెలు, సొన్నాయి కొరిచెలు అను విడి తెగల వింగడింపునకును, అసాదులలో మేళము వారు, బయలాటవారు అను వేర్పాటునకును ఈ నూతనవృత్తిస్వీకారమే హేతువు. ఈ వృత్తితోపాటు దానిని అంటిపెట్టుకొని యున్న మెఱవణిగద్య పఠనమును వారికి అలవడినది. అంగారకులును, అసాది, కొరిచె తెగలవారును మెఱవణిగద్య పాఠకులని తాత్పర్యము.

ఇరువంక పెండ్లి బంధుగులలో పరస్పరము వరుస కలవారు మేళగాంధ్ర నాయకునకు పొగడింపుల ముడుపుగా ఒకొకతూరికి అణానో, అర్ధణానో ఇచ్చి ఈ గద్యలను చదివింతురు. ఒకపక్షమువారి తరపున జరుగు పొగడిక పూర్తియగు దాఁక రెండవపక్షమువా రూరకుండవలసినదే. ఇట్లే ఏ పక్షమువారు ముడుపు చెల్లించిన వారిని పొగడి, ఆవలి పక్షమువారిని హాస్యములాడుట ఈ గద్యల తీరు. ఈ చదివింపులకు ఇరువైపులవారును మేము మేమని యెగబడుచుందురు. మొదటి సారి పొగడించినవారు ముడుపుగా ఎంత ముట్టజెప్పుదురో అంతకు తక్కువ డబ్బును తరువాతి పొగడ్తలకు అంగీకరింపరు. అంతకు సరిసమానముగానో, కొంత పెచ్చుగానో ఈయవలసి యుండును. పొగడ్తలకు పొంగి కొందఱు స్తుతి ప్రియులు బడాయికిపోయి హేమాద్రిదానపరులయి పైమీఁది జరీసెల్లాలను, రవల యుంగరాలను ఇనాముగా నిచ్చుటయు కలదు. ఇచ్చినవారిని ఇంద్రులనీ, చంద్రులనీ పొగడి వారి కెదిరికుదురువారిని ఎక్కడ దప్పినవారనీ, ఎందున కొఱగానివారనీ ఎక్కసక్కెము లాడుదురు. ప్రొద్దుపోవుచున్నదనీ, పొగడింపుల పోటీని చాలింపుడనీ పెండ్లిపెద్దలు ఎత్తులుపెట్టి ఎంత వేగిరించినను కుఱ్ఱకారు తమ వేళాకోళపు గొడవలను ఒకపట్టున కట్టిపెట్టరు. అదియంతయు నొక

కిష్కింధ ; లంకాపురము సంత. ఓ! ఆ సొగసు చూచుటకు రెండుకన్నులు చాలవు. మట్టుమేరలు లేని ఈ పొగడింపు పోటీల కోలాహలములో మెఱవణి బండి వీథీవీథులు వేంచేసి యెగసగబడి పెండ్లింటికి మరలి వచ్చునరికి తొలి కోళ్ళు కూయక తప్పదు.

మెఱవణిబండిదిక్కు మొగము సేసి, మేళము నాఁపి ఈ గద్యలను చదువుదురు. అంతసేపును మెఱవణిబండి ముందుకు సాగదు. వేమన, సుమతీ త్యాది శతకములలోని పద్యములను, కొన్ని చాటువులను సందర్భ మున్నను, లేకున్నను మెఱవణి గద్యకు ముందు బిగ్గరగా చదువుట మామూలు. గద్యలో మధ్యమధ్య విరామ స్థానముల ఊఁతగా డోలుకాఁడు ఆ యా పొగడిక, తెగడికల కనుగుణముగా 'హోహోహో, బళిబళీ, బాప్పురే, సెహబాసు' అను ప్రశంసా పదములను, 'అయ్యయ్యో, చీచీచీ, థూథూథూ, సిగ్గుసిగ్గు' అను హేళన పదము లను పలుకుచు డోలు వాయించుచు హంగుసేయుచుండును. ఈ గద్యలను చదువు మేళనాయకుఁడు దేవీపాదతీర్థము నించుక సేవించియుండెనా ఇఁక వాని యొడు పును పట్టపగ్గము లుండవు. వీరిలో ఈ యలవాటు లేనివారు నూటికో కోటికో ఒకరు. అడపదడప చుక్క పడనిదే చుఱుకు కలుగదఁట! వాక్కు శుద్ధిగా ఉండదఁట! మేళము సొగసు కట్టదఁట! మఱి వాద్యవాదక సామగ్రి సర్వాంగీ ణముగా సమకూఱినఁ గాని ఉత్సవమునకు రక్తి రాణింపు రానేరవు. పెండ్లివా రిచ్చిన దండి ఇనాములతో కుత్తుకబంటిగాఁ గ్రోలినఁగాని వారికి తృప్తి కలుగదు. ఈ గద్యల పాఠము లన్నియును నాలుగయిదుకంటె మించి లేవు. ఇవియును పరస్పరము సామ్యము కలవి. వీనినే మార్చిమార్చి కలగాపులగము సేసి చదువు చుందురు. మెఱవణి గద్యలకు, వరుసపాటలకు మూలతత్త్వ మొకటే! మెఱవణి గద్యపఠనములో ఉభయపక్షములవారును ప్రత్యక్ష భాగస్వాములు కారు. వరుస పాటలను ఏదోయొక వరుస కలవారు పాడుదురు. వరుస పాటలలో స్త్రీలు తమ అన్నదమ్ముల, అక్కచెలియండ్ర వరుస కలవారిని పొగడి, బావమఱఁదుల, ఆఁడుఁబడుచుల వరుస కలవారిని ఎగతాళి సేయుట పరిపాటి. పరిహాసవస్తుత విపర్యయముగా ఉభయపక్షములందును నిహితముకావున మెఱవణి గద్యలతీరును ఉభయవిధ బాంధవులెవరును వ్యక్తిపరముగా అన్వయముసేసికొనరు. ఓరపారలు లేనివారి కలుపుగోలుతనము, నవ్వినవ్వింపఁగల పరిహాసశీలత దీనికనువాదకము.

సంస్కృతమున గద్య, వచనము ఒకటికావు. గద్య ఒక ఛందోభేదము. వచనమను మాటకు ఛందోవిశేషమను అర్థములేదు. పాళీప్రాకృతములయందును

వచనమునకు గద్యమను నర్థము కానరాదు. ఈ యర్థమునఁ బ్రయుక్తమగుట తెనుఁగునఁగలిగిన మార్పు. తెనుఁగున రెండును చాలవఱకు సమానార్థకములు. ఈ రెండిటిని తిక్కన్న ఒకే యర్థమున వాడినాఁడు. [1]ఛందోదర్పణకర్త అనంతుఁడును అట్లే యనినాఁడు[2]. సంస్కృతాదుల వచనమను మాటకు వాక్యము, వివరణము, ప్రకటనము, పదము మొదలగునవి సామాన్యార్థములు. గద్య, వచనము ఇవి రెండును వేర్వేఱని కొందఱు; రెండును ఒకటేయని కొందఱు. ఈ రగడ అంతటనింతట తేలునదికాదు. అయినను వీనినిగూర్చి రెండేరెండుమాటలు. ఉపలబ్ధమగు సాహిత్యమును పరిశీలించినచో బిరుదుల, స్తోత్రముల పట్ల గద్యనామ ముపయుక్తము; సాధారణ కథాకథనమున వచనమను మాట ప్రయుక్తము. యక్షగానాదులందలి కథాసంధానమగు కవివాక్యమును వచనమని వ్యవహృతము. ఆశ్వాసాంతగద్యము లతిప్రసిద్ధములు. తిక్కన్ననాటికే తెనుఁగున వీనిభేదము విస్మృతమయినను ఆశ్వాసాంతములందలి గద్యములు మాత్రము ప్రత్యేకతను నిలిపికొనినవి. "...వాక్యసాంగత్యము సేయుచో నయిన గద్యము తోడుగఁజెప్పి పెట్టి..." నని ప్రతినవట్టిన తిక్కన్నయు ఆశ్వాసాంతగద్యల మానకుండుట గమనార్హము. జైమినిభారతాది వచనకావ్యములందలి ఆశ్వాసాంతగద్యలను ఇట అనుసంధింపనగును. ఆశ్వాసాంతగద్య లోకవిధముగా బిరుదావళి కావున పూర్వోక్త నిర్ణయము నిర్బాధకము.

మెఱవణి గద్యలు శబ్దాలంకార భూయిష్ఠములు. అన్నిరకముల ప్రాసక్రీడలు నిందుఁబ్రయుక్తములు. గద్యరూపములును, గ్రామ దేవకీయములును నగు స్తోత్రపాదములను కొలుపుల గద్యలందురు. నిర్ణీతకులములవారిని దండి తిను యాచకులు ఆయా కులములవారిని పొగడుచు చదివెడి వానిని కులముగద్యలందురు. గద్యరూపమునఁ జెప్పఁబడునది కావున ఎఱుక- సోదె-చెప్పుటను మా తట్టున 'గెద్ది' చెప్పుట అని యందురు. ఎదుటివారిని మాటాడనీకుండ సొంతగోడును అడ్డమాఁక లేకుండ ఏకరువు పెట్టుటకు కూడ 'గెద్ది' యని వాడుదురు. ఈ 'గెద్ది' గద్యకు వికృతి. ఈ క్రింది మెఱవణిగద్యల పాఠములను పరికింపుఁడు.

---

1. 'జాత్యముగామినొప్పయిన సంస్కృత మెయ్యెడఁజొన్ప వాక్యసాంగత్యము సేయుచో నయిన గద్యము తోడుగఁ జెప్పిపెట్ట....' (నిర్వచనో. ప్రథమా-14), 'వచనము లేకయు వర్ణనరచియింపఁగఁ గొంతవచ్చుఁ బ్రౌఢులకు...' (పైది. ప్రథమా-15) 2. 'కనుఁగొనఁ బాదరహితమై - పనుపడిహరి గద్దెవోలె బహుముఖ రచనంబున మెఱయు గద్యమది దాఁ - దెనుఁగుకృతుల వచనమనఁగ దీపించుఁ గడున్" (ఛందోదర్పణము. ద్వితీయా - 2).

వీనిలో పూర్వభాగము స్తోత్రప్రకరణము, ఉత్తరభాగము నిందాధ్యాయము అని వేఱ చెప్పనక్కఱలేదు.

"వాహోహాయ్! అప్రయోజకుఁడైన అప్రసిష్టుడైన అత్తగారింట పడి యుండుటదియురోత, పేదతనముండి పెండ్లాము పోరుండి సంతానముండుట చాలరోత, కూటిగింజల్లేక కౌఱముట్లు గతిలేక సేద్యంబుసేయుట చాలరోత, ప్రాప్తంబులేదని ఇద్దరు పెండ్లాలుండుట అదియురోత, త్యాగమందు కర్ణులు, భోగమందు దేవేంద్రులు, యోగమందు జనకచక్రవర్తులు, సత్యమందు హరిశ్చంద్రులు 'ముల్లంగి'[3] వాళ్ళు. వాళ్ళింటి దేవుణిపేరు జెప్పి, వాళ్ళ తలిదండ్రాదుల పేరుజెప్పి, వాళ్ళవ్వతాతల పేరుజెప్పి, పెండ్లికొడుకు పెండ్లికుమార్తెలు కట్టిన ముత్యాలబాసింగాల పేరుజెప్పి మేళగాళ్ళ కిచ్చిన జోడుకానుకలు దక్కెనోదక్కె.

వాహోహాయ్! యీ వూర్లో 'మాదాల'[4] వాళ్ళుండారంట! ముళ్ళంగి వాళ్ళ దెబ్బంటె 'వోయబ్బో' అని యెద్దు తోకెనకుండారో[5], మెరివిణి బండికిందుండారో, యెంగిలిస్తరాకు లెత్తేసేకే పొయినారో[6] జంగమన్న తోట్లో కల్లు తాగేకే[7] పొయినారో - అమాసనాడు పుట్టిన సొట్ట గాడిదాకట్ల[8] అడ్డగాళ్ళు పెట్టుకోని, అద్దరాత్రికాడ గుడ్లగూబాకట్ల[9] తిరుగుడు గుడ్లు పెట్టుకోని, జొన్నకొయ్యలాకట్ల పొండ్లు[10] పెట్టుకోని, కల్లమింద[11] తొండాబిక్క[12] ఆకట్ల ముక్కు పెట్టుకోని, పక్కీరోణి పిన్నాకట్ల[13] కడుపు పెట్టుకోని యెక్కెక్కడుండారో యెందెందు వుండారో సరైనబావమర్దులయ్యేయెదురూగొచ్చి టాగానికి[14] టాగమేయియ్యాల్లంట[15] రూపాయికిరూపాయే యియ్యాల్లంట! వస్త్రానికి వస్త్రమే యియ్యాల్లంట! సెల్లాకు సెల్లా యియ్యాల్లంట! అట్ల శాతగాకపోతే యీ వూరు మంచినీళ్ళబాయికి పోయి బంగారు సెంబుతో నీళ్ళు ముంచుకొచ్చి[16] ముల్లంగివాళ్ళ కాళ్ళుగడిగి, కాళ్ళుగడిగిన నీళ్ళు తలాగంటెడు తీర్థంతాగి మాదాలవాళ్ళు ముళ్ళంగివాళ్ళ కాళ్ళకింద దూరి పోవల్లాహోయి"[17]

ఇది ఇంకొక పాఠము :

"వాహోహాయ్! యంతదయో[18] దాసులపై పంతంబున మకరిబట్టి బాధింపంగా శ్రీకాంతుడు చక్రమంపెను దంతావళ రాజుగాయ దత్తాత్రేయా....

---

3. ఒక యింటిపేరు; 4. ఒక యింటిపేరు; 5. తోకవెనుక ఉన్నారో 6. ఎత్తివేయుటకు పోయినారో 7. త్రాగుటకే 8. గాడిద అకట్ల (గాడిదవలె) 9. గుడ్లగూబవలె, 10. పండ్లు, 11. ముండ్లకంచెమీఁద, 12. తొండ, 13. ఫకీరువాని పిన్ని (భిక్షపాత్రము) వలె, 14. త్యాగానకు 15. ఈవలెనఁట, 16. ముంచికొనివచ్చి 17. పోవలెనోహోయి; 18. ఎంత.

అన్నట్లుగాను యవరు పేరు జెప్పంటె[19] వారి తలిదండ్రాదుల పేరుజెప్పి, వాళ్ళత్త మామల పేరుజెప్పి, ఈ బసవేశ్వరుని పేరుజెప్పి, బంగారు తిమ్మరాజు[20] పేరు జెప్పి, మద్దికేరి మద్దమ్మ[21] పేరుజెప్పి, మందలో సుంకులమ్మ[22] పేరుజెప్పి, పెన్నోబళేసుని[23] పేరుజెప్పి, పైరివిలి రంగనాయకుల[24] పేరుజెప్పి వాళ్ళుకట్టిందే[25] ముత్యాలబాసింగాలపేరుజెప్పి మేళగాళ్ళకిచ్చిన జోడుకానుకలు దక్కెనోయ్‌దక్కె.

వాహోహాయ్! వోబళేసు బావమర్ది అయిన బయ్యన్న వుండాడంటె యక్కడక్కడుండాడో యాడాడవుండాడో గుర్రం తోకెనకుండాడో, గొర్రెలమంద కాడుండాడో, పప్పటక దగ్గరుండాడో, చెప్పులగూటం కిందుండాడో, పుల్లగూర సట్టిదగ్గరుండాడో, కల్లంగడికాడ కండ్లుగౌడుతుండాడో, పుల్లిస్తరాకు లెత్తుతుం డాడో, పెండ్లి పరమాణ్ణం[26] దాగి కొండేగారి[27] మళిగి[28] లో పండుకుండాడో సరికి సరి బావమర్ది అయితే యెదురూగొచ్చి[29] ఆయ్యా నా దగ్గర దుడ్లు[30] గతిలేవు, నీతో తూగేది నాకు శాతగాదు అని చిన్నబాయికి బోయి సెంబెడు నీళ్ళు తెచ్చి వోబళేసు కాళ్ళుకడిగిపోతాడో మడీ ట్యాగమే! మరి వోబళేసు దెబ్బంటె వుండికట్టి[31] మింద బండరాయెత్తినట్లే వాహోయి."

మఱియొకపాఠమిది :

"వాహోహాయ్! పెండ్లికొడుకు పెండ్లికుమార్తెల పేరుజెప్పి, వాళ్ళ పెద్దలపేరు జెప్పి, వాళ్ళ గురవాచార్ల పేరుజెప్పి, తాడిపర్తి తిమ్మనాయని[32] పేరు జెప్పి, గండికోట లింగమనాయని[33] పేరుజెప్పి, వాళ్లు మొక్కిన దేవుణి పేరు జెప్పి, వాళ్లయెక్కిన వాహనం పేరుజెప్పి, వాళ్ల కట్టిన కంకణాల పేరుజెప్పి, వాళ్లు పెట్టిన బాసింగాల పేరుజెప్పి పెండ్లికొడుకు అన్నగార్లు మెరివిణి సంబరంలో మేళగాళ్ళ కిచ్చిన జోడుకానుకలు దక్కెనొహోయ్ దక్కె.

వాహోహాయ్! చీచీచీ చీమలపుట్ట రెక్కల్లేని కోడిపెట్ట నీనోట్లో వుండు బుట్ట నిన్ను ముదిరిపెట్ట నీకాళ్ళాడగొట్ట - వోహోహో పెండ్లికొడుకు బావమర్ది పేడిమూతిపెద్దయ్య వుండాడే, యలకనిజూస్తే యదబడుతాడు, పిల్లినిజూస్తే పారి పోతాడు. పీతిరిగుంతలో పొర్లాడి, జలారిగుంతలో జలకాలాడి చినుగులచల్లాడం గట్టుకోని[34] గోనిపట్ట రుమాలు జుట్టుకోని, నల్లగంబడికోరి కప్పుకోని పెండ్లిభోజ

---

19. చెప్పుఅంటే 20. పాళెగాండ్ర యుగమునాటి ఒక స్థానిక ప్రభువు. 21, 22, 23, 24. స్థానిక దేవతలు 25. కట్టియుండెడి. 26. పాయసము 27. కొండయ్యగారి 28. అంగడి వసారా 29. ఎదురుగావచ్చి. 30. డబ్బులు. 31. గోగుకాడ 32, 33. విజయనగర కాలములో ప్రసిద్ధులగు కమ్మప్రభువులు. 34. కట్టుకొని.

నానికని వచ్చినాడు. అదిగోయిదిగో అని పోయినాడు. అదేః పోత ః ముసురు తొట్టిలో మూల్గుతుండాడో, దొంతికుండల్లో దొళ్లుతుండాడో, బానకడుపుతో పాకుతుండాడో, దోనికడుపుతో దోకుతుందాడో, దిడ్డికాళ్ళతో దేకుతుండాడో, తద్దికల్లు నాకుతుండాడో, పులిస్తరాకు లెత్తుతుండాడో, కలికుండ్లతో కలబడుతుండాడో యాడాడవుండాడో, యక్కెక్కడుండాడో... పెండ్లికొడుకు కింద పెండ్లికొడుకు అన్నదమ్ముల కింద డక్కోలాహోయి, డక్కోలు, బరాబరివాహోయి బరాబరి."

ఇంక నొక పాఠమిది :

"వాహోహాయ్ ః పగలరాతిగుండు పగలగొట్టగవచ్చు కొండలన్ని పిండిగొట్టవచ్చు, విశ్వదాభిరామ వినరవేమ అన్నట్లుగాను తూమాటోళ్ళ నారణప్ప అంటే చప్పన్నారుదేశాలలో సరదారు ః ముప్పైయారు పల్లెల్లో ముంజూరు ః యెక్కంగగుర్రాలు, యేడూర్ల పెత్తనం ః కుచ్చుల్లతురాయి పచ్చల్లపల్లకీ ః అయి దేళ్ళ కుంగరాలు అస్తకడియాలు ః యిదిగోఅంటే యిరవైమంది, అదిగోఅంటే అరవైమంది. పనిబడితే పాదాలకాడ పదివేలమంది. నారణప్పముట్టింది ముత్యమై పట్టింది బంగారమై, యెద్దుదొక్కిన బూమి యెయి[35] పుట్లుపండి, గరిసెబెట్టినతోన కనకసిరి పంటపండి, వూరూగేరీ[36] సబ్బండుజాతులు, డెబ్బైయేడుకులాలు తగ్గినా ముగ్గినా కంటికిరెప్పై కాలికిచెప్పై కాపాడి బోపానం[37] జేసినాడు. నారణప్ప[38] రాకపోతే రచ్చకట్టకు రవిశిలేదు; రాజుకచ్చేరీకి రాణింపులేదు. నారణప్ప అంటే త్యాగదల్లి[39] కర్ణ, భోగదల్లి[40] దేవేంద్ర, సత్యదల్లి[41] హరిశ్చంద్ర, మేళగాళ్ళకు చదివించిన జోడుకానుకలు దక్కెనోయ్ దక్కె.

వాహోహాయ్ ః నారణప్ప బావమర్ది జెట్టిబీసణ్ణ యక్కెక్కడుండాడో, యాడాడవుండాడో మొండిగోళ్ళకింద వుండాడో, ముసురుతొట్టికాడ వుండాడో, మజ్జిగనీళ్ల మాడు సెక్క దిని గజ్జికురుపులు బరుక్కుంటూ వూరిసావిడి జేరినాడో సరికిసరైన బావమర్ది అయితే యెదురూగొచ్చి ట్యాగానికిట్యాగం, బదిలీకిబదిలీ యియ్యాల్ల. తానూ త్యాగమయిన మనిషినని నారణప్పతో ఢీకొని దెబ్బకు తట్టుకోలేక మొగం తప్పించినాడు. సెక్తిలేకపోతే "నాతోకాదు బావ నీతో సరితూగేది" అని మంచినీళ్ళబాయికి బోయి నిండుచెంబు నీళ్లదెచ్చి కాళ్ళుగడిగి నారణప్పకింద దూరిపోవల్లాహోయి దూరిపోవల్ల[42] "

---

35. వేయి, 36. ఊరువాడ (గేరి-పేట, వాడ). 37. రక్షణ. 38. నారాయణప్ప. 39. త్యాగమందు 40. భోగమందు, 41. సత్యమందు (39, 40, 41. కన్నడభాషా ప్రభావ సూచకములు) 42. దూరిపోవలె.

వేఱొక పాఠమిది :

"వాహోహొయ్ !" కాననివనములో కస్తూరి కోనలో మందగిరి మింద మఱ్రిచెట్టు-చెట్టుకు పదహారు చెన్నంగికొమ్మలు కొమ్మకొమ్మకు కోటి కోతులుండు నగదరంబైనట్టి కొమ్మమిందను నక్క ఒగటున్నది చుక్కవలెను - చుక్కకు తూర్పున సుస్థిరంబైనట్టి సూర్యచంద్రాదులు తేజరిల్లు వీనికర్థంబు చెప్పేడి మానవులకు - నెలలు పండెండు గడువిత్తు నేర్పుతోడ - చెప్పదలచిన సర్వజ్ఞశేఖరుండు-చెప్పలేకున్న నగుడునే చిన్ననగవు. అన్నట్లుగాను యవరు పేరుజెప్పంటే వాళ్ళ తలిదండ్రాదులపేరు జెప్పి, వాళ్ళత్తమామల పేరుజెప్పి, సాసూల చిన్నమ్మపేరు జెప్పి, శాబాల పెద్దమ్మపేరుజెప్పి, కనికమ్మవారి పేరుజెప్పి, కదిరీ నరసిమ్ముల పేరుజెప్పి, పుట్టలో నాగేంద్రుని పేరుజెప్పి, కట్టవానుమంతరాయణి పేరుజెప్పి మేళగాళ్ళకిచ్చిన జోడుకానుకలు దక్కెనోయ్ దక్కె.

వాహోహొయ్ ! సుంకమ్మ యక్కెక్కడుందో, యాడాడవుందో యెద్దు తోకెనకుందో యెనుగొడ్డు యెనకుందో, తలబాలపందిరికిందుందో, సలిబిండి[43] దొంచిన[44] రోటికాడుందో, పాచ్చిర్ల గంపలోవుందో, కుచ్చెండ్ల సందులోవుందో, యల్లమ్మదెబ్బకి యక్కడైనా పారిపోయిందో, యల్లాపి[45] జనములో దూరిపో యిందో - యెదురూగొచ్చి "యల్లమ్మా నీతో సరితూగేకి నాతోకాదు. యేదో పెండ్లికొచ్చేతపుడు[46] వకబొట్టు[47] తెచ్చుకొనింటి. ఆ బొట్టుకి కట్లిపుడి[48] కొనుక్కుంటి చేతిలో దనియాలకు దమ్మిడీగతిలేదు. నీతోనేను సరితూగలే"నని నాగులబాయికిబోయి నిండుజెంబు నీళ్ళుదెచ్చి యల్లమ్మ కాళ్ళుకడిగి పోనేపోతుం దొహోయి."

మఱొక పాఠమిది :

"వాహోహొయ్ ! 'శ్రీరాముని దయచేతను - నారూఢిగ సకలజనులు నౌరాయనగా - ధారాళమైన నీతులు - నోరూరగ జవులువుట్ట నుడివెద సుమతీ' అన్నట్లుగాను యెవరుపేరు జెప్పంటె వాళ్ళ తాతముత్తాతల పేరుజెప్పి, వాళ్ళ యింటేలుపు[49] దేవుణిపేరుజెప్పి యీ వూర్లో వడ్లూరివారంటె త్యాగంలో కర్ణులు, భోగంలో దేవేంద్రులు, వూరికివురుంబోసిన[50] కీర్తి గేరికిబాయి దొగిచ్చిన[51] కీర్తి,

---

43. చలిమిరి. 44. దంచిన 45. క్రిందితరగతి ప్రజలు (అలగాజనము) 46. పెండ్లికి వచ్చెడునపుడు 47. కాని (అణాలో నాల్గవభాగము) 48. పొగాకుకాడలు దంపినపొడి (పొగాకు నువలె తాంబూలములో వేసికొందురు.) 49. ఇంటివేలుపు 50. ఉరుంబోయించు (ఒక వూరు కట్టించడమునకు ముందు జాతరచేయుట, బ్రౌణ్యనిఘంటువు, 1153 పుట.) 51. త్రవ్వించిన

యీశ్వరునెక్కేటి నందివాహనంబు తోడుగలిగి, పరమాత్ముడెక్కేటి పక్షివాహనంబు తోడుగలిగి, వజ్రాయుధం వరుసగలిగి, చక్రాయుధం సాయంకలిగి, దేవాన్ దేవతల దీవనలుగలిగి, ముక్కోటిదేవతల మొక్కుబడి గలిగి, ధనం ధాన్యం గలిగి, కొడుకులు కోమాళ్ళు గలిగి, 'చేతులకు తొడవుదానము, భూతలనాథులకు తొడవు బొంకమి ధరలో' అన్నట్లుగాను నూలువస్త్రం నూరేండ్లు వుండదు, పట్టువస్త్రం పదేండ్లు వుండదు. చేసినధర్మం సెడని పదార్థం, చెప్పినమాట శిలా శాసనం, చెమట మాసినసెల్లా, తొడిగివిడిచిన తోపుపచ్చడం వడ్లూరివారు మేళగాళ్ళకిచ్చిన జోడుకానుకలు దక్కెనోయ్ దక్కె.

వాహోహాయ్! వడ్లూరివాళ్ళ బావమర్దులుండారంటె దున్నేతతిలో యిత్తుతారు. యిత్తేతతిలో దున్నుతారు. కాలావతిలో కాళ్ళు జాపుతారు. కూడంగ కూడంగ కుండ్లమ్మితిన్నారు. వాడంగ వాడంగ వళ్ళమ్మి[52] తిన్నారు. చేండ్లన్నీ[53] చెడి చెన్నంగిపండి, తోట్లన్నీ తొండాబిక్కి గుడ్లుపెట్టి, తిక్కమొగాలు పెట్టుకోని, బిక్కమూతులు పెట్టుకోని పెండ్లిభోజనానికి వచ్చినారు. ఈ పై సోపురం[54] పాపయ్యలెందెందువుండారో, యక్కెక్కడుండారో పప్పులగాదిలో పందికొక్కు[55] లాల మెక్కుతుండారో, చక్కెరగాదిలో చుంచెలకళాల బుక్కుతుండారో, కొర్రల గరిసెలో కునుకుతుండారో, జొన్నలగరిసెలో జోలుతుండారో సరైన బావమర్దులయితే యెదురూగొచ్చి ట్యాగానికి ట్యాగమే యియ్యాల్ల! సవాలుకు పైసవాలు సెయ్యాల్ల; పంద్యానికి పైపందెం వెయ్యాల్ల!! శాతగాకుంటే రెడ్డోళ్ళ[56] బాయికి[57] బోయి నిండుజెంబు నీళ్ళుదెచ్చి వడ్లూరివాళ్ళ కాళ్ళుగడిగి పారిపోతారొహోయ్."



52. వడ (గారె) లు అమ్మి 53. చేనులన్నియు 54. సోమరి 55. పందికొక్కుల వలె. 56. రెడ్డివారి 57. బావికి.

# వేదము వేంకటరాయశాస్త్రి

# రూపక సమాలోచనము

— శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ

[ఈ వ్యాసము ఉస్మానియా విశ్వవిద్యాలయము తెలుఁగు M. A. విద్యార్థులు నిర్వహించిన "తెలుఁగు రూపక సమాలోచన" సమావేశములందు 22-11-58 నాడు చదువఁబడినది. ఆనాటి సభకు శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగా రధ్యక్షత వహించినారు.]

ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున గత శతాబ్దము సర్వవిధముల వినుతి కెక్కినకాలము. ఆంధ్రభాషామతల్లి యపూర్వాలంకారముల సంతరించుకొని సర్వతోముఖముగాఁ దన ఖ్యాతిని లోకమునకుచాటి ప్రపంచమునం దుత్తమ సాహితిగల భాషల సరసను సమర్హమగు స్థానమును సంపాదించుకొన్న స్వర్ణ యుగమది. గత శతాబ్దియం దెందరో మహాపురుషు లాంధ్రావనియందు జన్మించి, తమకు, నాంధ్రమునకు కీర్తిని గడించిపెట్టినారు. అట్టి మహాపురుషులలో మొదటికోవకుఁ జెందినవారు కీ. శే. "కళాప్రపూర్ణ" శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు.

శాస్త్రిగా రుత్తమోపాధ్యాయులుగా శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారలవంటి సాహితీస్రష్టలను సిద్ధముచేసియు, ఆముక్తమాల్యదా శృంగారనైషధా ద్యుత్తమాంధ్ర ప్రబంధముల కత్యుత్తమ వ్యాఖ్యల రచించియు, సంస్కృతనాటకములను మూలభావములు చెడకుండున ట్లనువదించియు, కథాసరిత్సాగర సాహిత్యదర్పణా ద్యుద్గ్రంథముల నాంధ్రుల కందించియు, సంఘసంస్కారవిషయమున వీరేశలింగము పంతులుగారికిని, భాషాసంస్కార విషయమున గిడుగు రామమూర్తిపంతులుగారికిని ఎదురొడ్డి నిలిచియు, నాంధ్రభాషాచరిత్రమున నుత్కృష్టస్థానమును సంపాదించుకొన్నారు. శాస్త్రిగారి యీ కృషియంతయు నొక్కయెత్తయిన వారి స్వతంత్రనాటకనిర్మాణ మొకయెత్తు. ప్రతాపరుద్రీయము శాస్త్రిగారి రూపకములకే గాదు. ఆంధ్రరూపక వాఙ్మయమునకే తలమానికము వంటిది. రూపకములందు ప్రతాపరుద్రీయమును, తదితర రచనములందు ఆముక్తమాల్యద వ్యాఖ్యానమును శాస్త్రిగారి నా రెండుశాఖలం దగ్రగణ్యులుగా నొనరించిన వనుట సత్యదూరముగాని మాట.

శ్రీ శాస్త్రిగారికి ప్రతిభ పరంపరాగతము. వారిది పండితులకుటుంబము. వారియింటిపేరు వేదమువారుగదా! శాస్త్రిగారి పూర్వులందఱును దమయింటి పేరును సార్థకపరచినవారే. వారందఱును యజ్ఞకర్తలుగా సోమయాజి పదము నధిష్ఠించినవారేనట. వేదమువారు తరతరములుగాఁ జేసిన హుతాశనారాధనమునకు ఫలమే శ్రీ శాస్త్రిగారి జన్మ మనుట విధివిహిత మయిన మాట. "పుత్ర మిచ్ఛే ద్ధుతాశనా" త్తని గదా ప్రాజ్ఞవచనము!

శాస్త్రిగారు 1853 డిసెంబరు 21 వ తేదీనాడు మదరాసు నగరమున జన్మించిరి. జనకులు వేదము వేంకటరమణశాస్త్రిగారు. జనని లక్ష్మమ్మగారు. వేంకటరమణశాస్త్రిగారు సంస్కృతాంధ్ర తమిళ భాషలందు పండితులు. వైయాకరణ పతంజలి యనియు, వేదవ్యాసులనియుఁ బ్రఖ్యాతినందినవారు. ఆంధ్రదేశమునం దనేకప్రాంతములందును, మదరాసు నగరమునను నుపాధ్యాయులుగాఁ బనిచేసినవారు. వేంకటరాయశాస్త్రిగారు తండ్రిగారికడ నెక్కువగా విద్యాభ్యాసము గావింపకున్నను వారి సంస్కారమే పుత్రునకు సంక్రమించె ననుట కొక్క యీ క్రిందివిషయము చాలును.

వేంకటరాయశాస్త్రిగారి రచనములందు ప్రతాప రుద్రీయమును, ఆముక్తమాల్యదవ్యాఖ్యయు నగ్రగణ్యములంటిమి గదా! ఆరెంటికిని వేంకట రమణశాస్త్రిగారే కారణము. వేంకటరమణశాస్త్రిగారు మిత్రులకు చెప్పి నప్పుడు విన్నకథయే ప్రతాపరుద్రీయ నాటకరచనకుఁ గారణమని శాస్త్రిగారే వచించినారు.* ఇఁక వేంకటరమణశాస్త్రిగారి కాంధ్రప్రబంధములం దాముక్త మాల్యద యభిమానగ్రంథ మగుటచే వారు దానిని నిరంతరము మననము చేయుచుండిరఁట. బహుశః అదియే శాస్త్రిగారి వ్యాఖ్యారచనమునకు హేతు వయి యుండును.

ఇఁక వేంకటరాయశాస్త్రిగారి విద్యాభ్యాసమును గుఱించి కొంచెము చూతము. వేంకటరమణశాస్త్రిగారికడ చాలమంది శిష్యులు పాఠములు చెప్పించుకొని లాభపడుచుండెడివారట. అయినను వేంకటరాయశాస్త్రిగారు మాత్రము వారికడఁ దమ విద్యాభ్యాసమును సాగింపలేదు. వారు ఆంగ్ల పాఠ శాలలందే చదివినవారు. అదియు మెట్రికుృలేషనువఱకే. తరువాత స్వీయ

*ప్రతాపరుద్రీయకథకు మూలము పరంపరాగతమయిన యొక కథ యని శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు వచించుచున్నారు.

ప్రయత్నముపైననే సంస్కృతాంధ్రాంగ్లభాషలలో నపార పాండిత్యమును సంపాదించినారు. వారు B. A. పట్టమును బూర్తిగాఁ బుచ్చుకొనలేదు కాని యా పరీక్షయందలి యింగ్లీషు సంస్కృత భాగములందు మదరాసు విశ్వవిద్యాలయమునం దందఱకన్న నెక్కువమార్కులు సంపాదించుకొన్నారు. శాస్త్రిగారికి షేక్స్పియర్ నాటకములపై నందును మాక్బెత్తు నాటకముపై నభిమానము మెండట. వీరప్పుడప్పుడు క్లాసులందు షేక్స్పియర్ నాటకములపైఁ జేయు విమర్శనములు ఆ కాలమున మదరాసు క్రిశ్చియన్ కళాశాలకు ప్రిన్సిపాలుగానుండిన మిల్లరు దొరగారికి సైత మాశ్చర్యమును గలిగించెనన్న చో వారి యాంగ్ల భాషావైదుష్యము కొంత తెలియగలదు. వారి సంస్కృతాంధ్ర భాషాపాండిత్యమును నేను వివరింప నవసరములేదుగదా! శాస్త్రిగారికి తమిళ భాషయందును బ్రవేశము గలదనుటకు ప్రతాపరుద్రీయమునందలి గాయకుల వాక్కులు ప్రమాణములు. వారి మహమ్మదీయపాత్రల సంభాషణమునుబట్టి శాస్త్రిగారికి హిందూస్థానీతోఁగూడ కొంత పరిచయముగలదని తోచుచున్నది.

సంస్కృత నాటకములతో శాస్త్రిగారికిఁగల సంబంధమును వారి యనువాదనాటకములు చక్కగాఁ జూపును. అందును భవభూతి కాళిదాసుల యెడ వారికాదరము మెండు. శాస్త్రిగారు నాటకములను సాహిత్య దృక్పథముతో మాత్రమే చదివి యూరకుండువారు కారు. వాని ప్రయోగార్హతను రుజువుపఱచుటయందును శాస్త్రిగారికి పట్టుదలమెండే. అందుకే వారు భవభూతి యుత్తరరామచరితమును దమ శిష్యులచే మదరాసున నత్యుత్తమముగాఁ బ్రదర్శింపఁ జేయించి ప్రేక్షకుల మన్ననల నందినారు. ఉత్తరరామచరిత నాటకము ప్రయోగార్హము కాదనియే యానాడు పలువురు పండితుల యాశయము, ఈ విధముగా కళాప్రపూర్ణులు భారతాభారత రూపక మర్యాదలను క్షుణ్ణముగా నెఱిఁగి, ప్రయోగ విజ్ఞానము కలవారు కావుననే వారి నాటకముల కా ప్రత్యేకత.

శాస్త్రిగారి యనువాదనాటకములను గూర్చి నా మిత్రము సుప్రసన్న చెప్పియున్నాఁడు. శాస్త్రిగారు సంస్కృత నాటకముల ననువదించిన విధము ప్రత్యేకమయినది. వారు క్లాసులో విద్యార్థులకు బహువారములు పాఠములు చెప్పి, యనేక వ్యాఖ్యలను బరిశీలించి, విమర్శనముల విలోకించి, పాఠాంతరముల జల్లించి సాధుపాఠముల నిర్ణయించి యా పైని ఆంధ్రీకరణమునకు పూనుకొను వారఁట. అంతశ్రమపడి చేసినవి కావుననే వారి యనువాదములు

మూలమునకు దగ్గఱగా నుండుట తటస్థించినది. ఇఁక వారి స్వతంత్ర రూపకముల విషయమును చూతము.

శాస్త్రిగారు రచించిన స్వతంత్ర రూపకములు మూఁడు. అందు వారు మొదట నిర్మించినది ప్రతాపరుద్రీయము. దీనిని శాస్త్రిగారు 1897 సంవత్సరమునఁ బ్రకటించిరి. తెనుగురూపకవాఙ్మయచరిత్రమున 1897 వ సంవత్సరము బహు ముఖ్యమయినది. దానికి కారణ మేమనగా నా సంవత్సరముననే ప్రతాపరుద్రీయమువంటి యత్యుత్తమాంధ్ర స్వతంత్ర రూపక మావిర్భవించినది అంతేగాదు, మఱియొక యుత్తమాంధ్రరూపకమగు శ్రీ గురజాడవారి 'కన్యాశుల్కము' ప్రకటింపఁబడిన సంవత్సరమును అదియే.

శాస్త్రిగారి స్వతంత్ర రూపకములందుఁ బ్రతాపరుద్రీయము మొదటి దయినను నది వారి రచనకు మొదటిదికాదు. అంతకుముందే వారు శ్రీహర్షుని నాగానందమును, కాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలమును నాంధ్రీకరించి యుండిరి. అంతేగాదు, వారి కథాసరిత్సాగరము నంతకుముందే 1891 సం॥రమునఁ బ్రకటింపఁబడి యుండెను. మఱికొన్ని గ్రంథములు నదివఱకే వారు వ్రాసియుండిరి. ప్రతాపరుద్రీయమునే నాటక రచనకుఁబూర్వము కథగా నల్లిపత్రికయందు ప్రకటించిరి. ఇన్ని గ్రంథము లదివఱకు రచించినను శాస్త్రిగారికి గ్రంథనిర్మాణము నెడఁ గల ప్రత్యేక శ్రద్ధను దెలుపుట కొక్క విషయము నిక్కడ ప్రస్తావింతును.

ప్రతాపరుద్రీయము ప్రకటింపబడునాటికి శాస్త్రిగారి జనకులు వేంకటరమణ శాస్త్రులుగారు జీవించియే యుండిరట. శాస్త్రిగారి ప్రతాపరుద్రీయమునకు వస్తువు వీరికడనుండియే గ్రహింపఁబడినదని ముందే చెప్పితినిగదా! శాస్త్రిగారు తమ ప్రతాపరుద్రీయ నాటకమును దండ్రిగారు చూచుట తటస్థించినప్పుడు తాము తలుపుచాటున నిలిచి బిక్కుబిక్కుమని భయాందోళనములనందుచుండిరట. తరువాత వేంకటరమణశాస్త్రిగారు గ్రంథమును జదివి శాస్త్రిగారి సోదరులతో "మీ అన్నయ్య బాగుగానే వ్రాసినాఁడోయి" యని యనిరట. అప్పుడు శాస్త్రిగారి మనసు కుదుటపడినదట.

శాస్త్రిగారి మఱియొక స్వతంత్రరూపకము ఉష. దీనిని వారు 1901 సం॥ రమునఁ బ్రకటించిరి. శాస్త్రిగారి యుషానాటకము వారి మిత్రులును, బహుభాషాకోవిదులును, సుప్రసిద్ధభాషాశాస్త్రవేత్తలును నగు శ్రీ T. M. శేషగిరిశాస్త్రిగారి కీర్తిమూర్తి కంకితము చేయఁబడినది. ఆ

సంవత్సరముననే శేషగిరిశాస్త్రిగా రిహలోకమును వీడిపోఁగా వేంకటరాయ శాస్త్రిగారు తమ కృతిని వారి స్మృతిచిహ్నముగా నిలిపినారమని వచించు కొన్నారు.

శాస్త్రిగా రీ యుషానాటకమును నిర్మించుటకుఁగల కారణము నిట పేర్కొనుట యప్రస్తుతముకాదు. వేంకటరాయశాస్త్రిగారు నాటకముల నెట్టి దృష్టితో చూచెడివారో ముందు తెలిపినానుగదా! వారికందు సాహిత్య దృక్పథము మాత్రమేకాదు. ప్రయోగవిషయమునను బట్టుదలమెండే. వారు ఆనాటి మఱికొందరు నాటకకర్తలవలె నటకులుకారుగాని యెందఱో మహా నటులను నాట్యమున శిక్షించిన నటగురువులు. తత్ఫలితముగా 1899 లో నెల్లూరు నగరమున "ఆంధ్రభాషాభిమాని సమాజము" శాస్త్రిగారి శిష్యులగు నటులతో నేర్పడినది. మదరాసులో నింకొక్కటి "విద్వన్మనోరంజని సమాజము" స్థాపితమైనది. ఈ రెండు సమాజములవారును శాస్త్రిగారి నాటకములను వారి శిక్షణముననే ప్రదర్శించెడివారు. అందు నెల్లూరు సమాజము వారికి శాస్త్రిగారి నాటకములనే గాని ప్రదర్శింపమని ప్రతిన. అందుకే పై రెండు సమాజములవారి ప్రార్థనమును బురస్కరించుకొని "అత్యర్థయామమాత్ర ప్రయోజనీయ" మగు నీ చిన్ని నాటకమును శాస్త్రిగారు నిర్మించి యిచ్చినా రట. ఈ విషయమును వారే తమ యుషానాటకమున వచించినారు.

ఇఁక మూఁడవదియు శాస్త్రిగారి స్వతంత్రరూపకములలోఁ జివరిదియు నగు బొబ్బిలియుద్ధ నాటకమును శాస్త్రిగారు 1916 వ సంవత్సరమునఁ బ్రక టించిరి. శాస్త్రిగా రీ బొబ్బిలిని బ్రకటించునాటికే యాపేరుగల నాటకము లొండు రెం డాంధ్రభాషయం దుండెనట. అయ్యు దీనిని వీరు మరల రచించు టకు కారణము నెల్లూరి సమాజమువారి పట్టుదలయు, శాస్త్రిగారి కీ బొబ్బిలి కథావస్తువుపై నున్న యాదరమునని శాస్త్రిగారి పలుకులే చెప్పుచున్నవి. వారికీ గ్రంథరచనము "గంగాస్నానము"వలెఁ బవిత్రమయినదిగాఁ దోచినదట.

ఈ బొబ్బిలియుద్ధ నాటక నిర్మాణమునకు సంబంధించిన యింకొక్క విషయము నిట వచించుట యప్రస్తుతముగాదు. శాస్త్రిగారి కాదినుండి యనేక విధములుగ నార్థికసహాయ మొనరించి ప్రతాపరుద్రీయ నాటక కృతిభర్తలైన వేంకటగిరిరాజావారు వెలమవా రగుటచేత వెలమవీరుల వీరవృత్తాంతమును దెలుపు నీ గ్రంథ నిర్మాణమునకు శాస్త్రిగారు పూనికొనిరట. బొబ్బిలియుద్ధ నాటక ప్రస్తావనయందు వేంకటగిరిరాజావారి ప్రశంసగలదు. శాస్త్రిగారి యీ

నాటకము పుట్టిన 1916 సంవత్సరముననే యా రాజావారు దేహయాత్ర చాలించినారట.

ఈ విధముగా శాస్త్రిగారు స్వతంత్ర రూపకముల మూఁటిని తెలుగు భాషాయోష కలంకారములుగా సమర్పించినారు. వారు 1916 తరువాత స్వతంత్ర నాటక నిర్మాణము నాపివేసినను, సంస్కృత రూపకానువాదములఁ జేయుట మానలేదు. వారు 1920 లో భవభూతి మహాకవి ఉత్తరరామ చరిత మును, ఆ మరుసటి సంవత్సరమునందు కాళిదాసుని విక్రమోర్వశీయమును, శ్రీహర్షుని రత్నావళి నాటికను అనువదించి ప్రకటించినారు. ప్రియదర్శిక, మాళవికలు అంతకుముందే యనూదితములైనవి. శాస్త్రిగారిట్లు మొత్తము దశరూపకములఁ దెలుఁగు వారికిఁ జూపినారు. వారి స్వతంత్ర రూపకములను వివరముగాఁ బరిశీలించుటకు ముందొక విషయము నిట మనవిచేయుట యను చితముగాదని భావింతును. అది నాటకము లందలి భాషకు సంబంధించినట్టిది.

## నా ట క భా ష

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు 1891 వ సంవత్సరమునందుఁ దమ తొలిరూపకానువాదమగు నాగానందమును బ్రకటించిరి. అందు వారు నీచ పాత్రలకు గ్రామ్యభాష నుపయోగించినారు. అందుకని దేశమునఁ బండితుల మధ్య నొక వివాదపు దుమారము రేగినది. నాటకములలో గ్రామ్య ముంచరాదని వాదించు కొక్కొండ వేంకటరత్నముపంతులు, ధర్మవరము రామకృష్ణమాచార్యులు, కోలాచలము శ్రీనివాసరావు, వావిలికొలను సుబ్బా రావు మొదలగు పండితులు కవులు నొకపక్షము. గ్రామ్యము నాటకములందు ప్రయోగార్హమే యని వాదించు శాస్త్రిగారి వర్గ మొక పక్షము. నేడు శాస్త్రి గారి వాదమునకే బలము మెండని వచింపఁబనిలేదు! విచారింపఁగా గ్రామ్యము ప్రయోగార్హమే యని వచించిన ప్రాచీనలాక్షణికులును లేకపోలేదు.

ద్వితీయాచార్యుఁడని ప్రసిద్ధివహించిన యథర్వణుఁడు "గ్రామ్యం తత్తద్విధా సాధు" అని వచియించెను. దీనిని మనసునం దుంచుకొనియే కాఁబోలు! బహుజనపల్లి సీతారామాచార్యులుగారు "గ్రామ్యంబు తత్తజ్జాతి వర్ణనంబునం బ్రయోగార్హంబగు" నని సూచించి కొన్ని యుదాహరించినారు. ప్రాచీన లక్షణ వేత్తలలో నెన్నఁదగిన విన్నకోటపెద్దన కావ్యాలంకార చూడామణియందు

"ఈసడములు గోరడములు
గాసర బీసరలునైన కట్టిడి పలుకుల్
భాసిల్లు గ్రామ్యములు నా
హాసోక్తులఁ దెగడుచోట నవియును నొప్పున్." (9-20)

అని పరిహాస వాక్కులందు గ్రామ్యము లుంచఁదగునని వచించినాఁడు. శ్రవ్యకావ్యముల విషయమే యిట్లుండగా దృశ్యకావ్యవిషయమునఁ జెప్పవలయునా ? లోకవృత్తానుకరణమే నాట్యమని శాస్త్రజ్ఞు లంగీకరించినారు గదా !* లోకమున శిష్టాశిష్ట వ్యవహారమునఁగల భేదము స్పష్టము గదా ! కావుననే మహాకవులగు కాళిదాసాదులు శ్రవ్యకావ్యములందును భిన్న భిన్న వర్గములకుఁ జెందిన భిన్నభిన్న పాత్రముల కా యా రీతి నుచితమగు నట్లుగా భాషను గూర్చిరని పెద్దలందురు. సంస్కృత రూపకములందలి భాషా భేదము సుప్రసిద్ధము సుదృష్టము నయిన విషయముగదా ! కావుననే శ్రీ వేంకటరాయశాస్త్రిగారు తమ కాలములోని పండితులెన్ని విధముల యాటంకములఁ గలిగించినను, వానిని లక్ష్యపెట్టక తమ నాటకములం దన్నింటను పాత్రోచితముగా గ్రామ్యమునేయుంచి తరువాతివారికి మార్గదర్శకులయినారు. ఇక్కడ నొక విషయమును మనము స్పష్టముగా గ్రహింపవలసియున్నది. శాస్త్రిగారు తాము నాటకములందు నీచపాత్రలకు వాడినది గ్రామ్యభాషయే కాని "వ్యావహారికము" గాదు. అందుకే వారు మొదట శుద్ధ గ్రాంథికవాదులగు కొక్కొండ పండితాదుల నెట్లెదిరించిరో యట్లే శుద్ధ వ్యావహారిక వాదులగు శ్రీ గిడుగు రామమూర్తి మొదలగువారి నెదిరించిరి. ప్రతాపరుద్రీయము నందలి

"వీరణ్ణి రాగణ్ణి మన్ను చేయిస్తాన్
గోతిలో పాతించి గోరీకట్టిస్తాన్"

అను వెట్టియుగంధరుని వచనము శాస్త్రిగారానాటి పండితులను గూర్చి వచించినదేయని పెద్దలందురు.

ఏమయినను శాస్త్రిగారు పాత్రోచిత భాషావాదులేగాని శుద్ధ గ్రాంథిక వాదులు కాని వ్యావహారిక భాషావాదులు కాని కారు. ఇందుకు వారిగ్రంథములే ప్రమాణము. ఇఁక వారి స్వతంత్ర రూపకముల గూర్చి యాలోచింతము.

---

* "లోకవృత్తానుకరణం నాట్య మేత న్మయా కృతమ్" (భరతముని నాట్యశాస్త్రము. అ. 1. శ్లో. 112)

# ప్రతాపరుద్రీయము

వానిలో కాలమును బట్టియు గుణమును బట్టియు మొదట గణింపఁదగినది ప్రతాపరుద్రీయము. ప్రతాపరుద్రీయమునందు శాస్త్రిగారి ప్రతిభ సర్వతోముఖముగా యుగంధరమంత్రి ప్రతిభవలె వీరవిహార మొనర్చెననుట ప్రాజ్ఞులు సమ్మతింపరానిదిగాదు.

మహాకవులు గ్రంథములనేకములు రచింతురు. కాని యవియన్నియు నొకే విధముగాఁ గవికీర్తిని ప్రకటింపలేవు. అందొక్కొక్కటి మాత్రమే యాతని సర్వతోముఖశక్తిని లోకమునకుఁ జాటి యాతని కుత్కృష్ట స్థానమును గూర్చును. మహాకవి కాళిదాసు రచించినవానిలో నభిజ్ఞానశాకుంతల మట్టిది. భవభూతి రచనములందు త్తరరామచరిత్ర మటువంటిది. వేంకటరాయ శాస్త్రిగారి కృతులలోఁ బ్రతాపరుద్రీయమట్టిది.

ప్రతాపరుద్రీయము శాస్త్రిగారి రూపకములందేగాదు, ఆంధ్రరూపక వాఙ్మయమునకే తలమానికమువంటిదని ముందు మనవి చేసితిని. దాని సరసను గాదుకదా దరిదాపులనైనఁ జోటు సంపాదించిన రూపకము మఱియొకటి యాంధ్రమున లేదన్న నసత్యముగాదు. అట్టిది కన్యాశుల్క మొక్కటి కలదని కొందఱనవచ్చును. కాని యది సరిగాదు.

కన్యాశుల్కములోని యితివృత్తమునకు శాశ్వతత్వములేదు. ఒక్కొక్క సమస్యను బురస్కరించుకొని ప్రచారార్థమయి బయలుదేరిన గ్రంథసాహిత్యమా సమస్యరూపుమాయఁగనే తన పూర్వపు టౌన్నత్యమును గోల్పోవును. కన్యాశుల్కమట్టిది. కావుననే యది మెల్లమెల్లగాఁ దన గొప్పఁదనమును గోల్పోవుచున్నది. నేడు "కన్యాశుల్కము"లేదు. అదియేగాదు వరశుల్కమును బోవు స్థితి యేర్పడినది. నాచ్చి క్వెళ్చను మాతరమువారి కర్థముకాదు.

ప్రతాపరుద్రీయములోని యితివృత్తమట్టిదిగాదు. దానికి శాశ్వతత్వమున్నది. వాల్మీకి మహాముని సృష్టించిన సీతారామాదులవలె శాస్త్రిగారు సృష్టించిన యుగంధరుఁడు సజీవపాత్ర మయినాఁడు. ఆతఁడిక మరణింపఁడు. ఆతనికీర్తి కిక చలనములేదు. ఈ మహామంత్రి కథ తెలుఁగుదేశమున నక్షరాస్యు లున్నంతదాక నశ్లే నిలచును. ఎప్పు డే కాలమునఁ జదివినను నది నిత్యనూతనమయి భాసిల్లుచుండును. ప్రతాపరుద్రీయము నందలిది తాత్కాలిక సమస్యకాదు. అది సృష్ట్యాదినుండి ప్రళయకాలము వఱకునుండు సమస్య



కావుననే యిందలి యితివృత్తమునకు శాశ్వితత్వమున్నదనుట. మఱియొక్క విషయము: ఇది పాఠకుల సంస్కారమునకు సంబంధించినది. ప్రతాప రుద్రీయమును జదివి యానందించు పాఠకులందఱును కన్యాశుల్కమును జదివి యానందింతురనలేము. దానికింకొక సంస్కారము కావలయును. అది యాంగ్లభాషా జ్ఞానమువలనఁగాని రాదు. కావున కన్యాశుల్కమొక్క ఆంగ్లభాషా పరిజ్ఞానమున్న యాంధ్రమహాజనులకు మాత్రమే యానందదాయి యగుచున్నది.

ప్రతాపరుద్రీయ మట్టిదిగాదు. ఇందలి భాష తెలుఁగు. హాస్యము తెలుఁగు హాస్యము. ఎక్కడఁ జూచినను తెలుఁగుఁదనము మూర్తీభవించినట్లుండు నీ నాటకమును జూచి యానందించుటకు తెలుఁగువాడై తెనుఁగుభాష నెఱిఁగి యుండుట చాలును.

కనుకనే ప్రతాపరుద్రీయ మాంధ్రరూపకవాఙ్మయమునకు తలమానిక మనుట.

ఈ నాటకమున శాస్త్రిగారి ప్రతిభ సర్వతోముఖముగ వీర విహార మొనర్చినదని ముందు చెప్పితినికదా! అదియెట్టిదో చూతము.

## ప్రతాపరుద్రీయమునందలి యితివృత్తము

ప్రతాపరుద్ర మహారాజు ఏకశిలానగరరాజ్యము నేలిన చారిత్రక పురుషుఁడు. ముమ్మడమ్మ యాతనితల్లి. విద్యానాథుఁడాతని యాస్థాన విద్వాంసుఁడు. ప్రతాపరుద్రీయ మను గ్రంథము నా మహారాజుపై రచించిన మహాకవి. ప్రతాపరుద్రుని సమకాలీనుఁడగు ఢిల్లీసుల్తాను గయాజుద్దీను తుగ్లక్. వీనికుమారుఁడు ఉలుఫ్‌ఖాను. పిమ్మట మహమ్మద్ - బీన్ - తుగ్లక్‌గా మారినవాఁడు. వీరందఱును చారిత్రక పురుషులే. ప్రతాపరుద్రుని మహమ్మదీయులు ఢిల్లీకి చెఱఁగొని పోయినదియును జారిత్రకసత్యమే. ఉలుఫ్‌ఖాను ప్రవేశమొక్కటి తక్క ప్రతాపరుద్రీయమునఁ గడమవాని ప్రవేశము గలదు. ఉలుఫ్‌ఖాన్ కార్యము నిందు వలీఖాను నిర్వహించినాఁడు. గయాజుద్దీనును హతమార్చుట యందు ఉలూఫ్‌ఖాను కృతకృత్యుఁడైనట్లు చరిత్ర చెప్పుచున్నది. వలీఖాను తానే చచ్చినట్లు ప్రతాపరుద్రీయము చెప్పుచున్నది. ప్రతాపరుద్ర చక్రవర్తి తిరిగివచ్చెననుటకు చరిత్రలో నాధారములులేవు. మన నాటకమున కంత

ముఖ్యుఁడయిన యుగంధరుఁడు నింకఁ జరిత్రకు దొరుకలేదు.* పరిశోధకు లింకను వెతుకుచునే యున్నారు. భవిష్యద్గర్భమున నేమి దాగియున్నదో! యుగంధరుఁడు చరిత్రజ్ఞులకు దొరికిననాఁడాలోచింతము. ప్రస్తుతమున కా పాత్రము శాస్త్రిగారి సృష్టియనియే భావింతము.

ఇక్కడ నొకవిషయము. ఈ యుగంధరమంత్రిని శాస్త్రిగారెక్కడ నుండి తెచ్చియుందురు? అనున దొకప్రశ్న. భాస మహాకవిరచించిన ప్రతిజ్ఞా యౌగంధరాయణమునందలి యౌగంధరాయణుఁడే శాస్త్రిగారి రచనమునకు మూలమని కొందరు పండితులయూహ.† అందును యౌగంధరాయణుఁడు పిచ్చివానియాకారమునే ధరించి తనప్రభువును విడిపించితెచ్చును. కాని యిందు కొక యభ్యంతరమున్నది. 1912 లో గణపతిశాస్త్రిగారు ప్రకటింమదనుక భాసనాటకములను లోకమెఱుంగదే, అందుండి శాస్త్రిగారెట్లు గ్రహించిరి? అనునదేయది. నిజమే! శాస్త్రిగారి ప్రతాపరుద్రీయము 1897 లోనే భాస నాటకములు లోకపువెలుఁగును జూచుటకు 15 సం॥ రముల ముందుఁ బ్రకటింపఁబడినదిగదా! కావున శాస్త్రిగారు దీనిని భాసునినుండి గ్రహింపలేదనియే చెప్పవలెను.

మఱి కొంచెము ముందునకుఁ బోదము. భాసుఁ డీ యౌగంధరాయణ పాత్రము నెక్కడనుండి గ్రహించెను? యౌగంధరాయణుని సంగతి యటుండ నిండు, ఆనాటకకథ యాతనికెక్కడిది? బృహత్కథలోనిదని దానికి సమాధానమురాకతప్పదు. ఈయొక్క కథనేగాదు. మఱి కొన్నింటినిగూడ నాతఁడందుండి గ్రహించి నాటకముల రచించినాఁడు.‡ మఱి వేదము వేంకటరాయశాస్త్రిగారు ప్రతాపరుద్రీయ రచనకు ముందే 1891 సంవత్సరము నందు బృహత్కథానువాదమును కథాసరిత్సాగరము నాంధ్రీకరించి ప్రక

---

*చూ. కాకతీయ సంచికలోని డా॥ మారేమండ రామారావు M. A. Ph. D. గారి సంపాదకీయము.

†చూ. "ఆంధ్ర నాటకకర్తలు" లోని డా॥ దివాకర్ల వేంకటావధాని, M. A. (Hon.) Ph. D. గారి "వేదమువారి స్వతంత్ర నాటకములు" అనువ్యాసము- 38 వ పుట.

‡భాసుఁడు బృహత్కథనుండి యీ యితివృత్తమును గ్రహించెననుటను పండితులు కొందఱంగీకరింపరు. అట్టివారు భాసుఁడు తనకాలమునందు జనులు చెప్పుకొను కథల నాధారముగాఁగొని వీనిని రచించెనందురు. చూ. Prof. T. గణపతిశాస్త్రిగారి స్వప్నవాసవదత్త పీఠిక.

టించినారుగదా! కావున నీయుగంధరపాత్రను వారు కథాసరిత్సాగరమునుండి భాసమహాకవి బృహత్కథనుండి వలెనే గ్రహించిరని తేలుచున్నది.

ఎంతమంది మహాకవులు కథాసరిత్సాగరమును జదువలేదు! వారందఱు నాతనిని గ్రహించిరా? నాడు అతఁడు భాసునకే కనుపట్టినాఁడు. మఱల నొక్క శాస్త్రిగారికే లభించినాఁడు. ఆ లభించిన జాతిరత్నమును వన్నెలుపెట్టి తీర్చిదిద్దినారు ఈ మహాకవులిరువురు. ఆదిద్దుటయు నిరువురియం దొక్కవిధముగాలేదు. అందుకు వారుతీసికొన్న యితివృత్తమునందే యట్టి భేదమున్నది. దిద్దుటలో నింతభేదమున్నది కావుననే మనయుగంధరుఁడు తెలుఁగు యుగంధరుఁ డయినాడు.

కథను దీసికొన్నచో స్థూలముగా మూఁడు వాక్యములలోఁ జెప్పివేయ వచ్చును. వరంగల్లుచక్రవర్తి ప్రతాపరుద్ర మహారాజును ఢిల్లీసుల్తాన్ సేనాని వలీఖాను మోసముచేసి చెఱఁగొనిపోయెను. తెలుఁగుచక్రవర్తి మంత్రి మఱల మోసముచేతనే రాజును విడిపించికొని తెచ్చెను. ఇదియే కథాబీజము. దీనినే శాస్త్రిగారు స్వీయప్రతిభచేఁ బెంచి పెద్దదానినిచేసి 10 అంకములుగల బిగువయిన నాటకముగా నొనరించిరి. ఆవిధమును గొంచెమరయుదము.

తురకమోసమునఁ బ్రతాపరుద్రుని చెఱఁబెట్టెనంటిమిగదా! ప్రతాపరుద్రుఁడు సామాన్య రాజమాత్రుఁడుకాఁడే! నవలక్ష ధనుర్ధరాధిపతి. విశాల త్రిలింగ సామ్రాజ్యరమాధురంధరుఁడు. అపార రాజనీతిరహస్య సంవేది. యుగంధరునివంటి ప్రజ్ఞాశాలు లాతనిమంత్రులు. ఇంతటి మహారాజును తురక సరదారుఁ డొక్కఁడు అల్పతర సేనాపరివారముతో బట్టికొనిపోవుటయెట్లు సంభవము? అనునది సామాన్య ప్రశ్నకాదు. దానికై శాస్త్రిగారొక చక్కని కల్పనముఁ గావించినారు.

యుగంధరుఁడు యాత్రలకేగినాఁడు. వెడలునప్పటికి రాజ్యమున నెట్టి యాపత్సూచనలును లేవు. అయినను అతఁడు తగుజాగ్రత్తలు చేసియే వెళ్ళినాఁడు. యుగంధరుఁ డూరలేనప్పుడే రాజువేటకయి దూరప్రదేశములకు వెళ్ళినాఁడు. అదేసమయమున తురకలు హఠాత్తుగ వరంగల్లును సమీపించినారు. వారికి రాజమంత్రుల విషయము తెలిసినది. వెంటనే రాజుగారున్న ప్రదేశమున కొక్కతురక బయలుదేరినాఁడు. రాజున కిదియంతయు తెలియదుగదా! అతఁడు వేటయందలసిపోయి యొకచెట్టుక్రింద నిద్రించినాఁడు.

నిద్రించినరాజును తురకపరివారము చూచినారు. వెంటనే సర్దారు ఆజ్ఞచొప్పున నాతనిని రాజోచితముగా బంధించి గోదావరినిదాటించి ఢిల్లీకిఁ గొనిపోయి నారు. ఇదియంతయు ననుకొనని యంత వేగముగ జరిగిపోయినది.

కాని యింతసేపును ప్రతాపరుద్రుని మంత్రులూఱకనే కూర్చుండినారా? లేదు. అందు జనార్దనమంత్రి యుగంధరునికడ శిక్షణము బొందినవాఁడు. ఆతనికి నమ్మినబంటీతఁడు. అతఁ డూరకుండువాఁడా? ఆతఁడును తగుజాగ్రత్త తోనే యున్నాఁడు. తురకలరాకను గనిపెట్టి యెన్నెన్ని జాగ్రత్తలు తీసి కొనవలెనో అన్నియు తీసికొన్నాఁడు. అన్న యుగంధరునకు, రాజునకు, వార్తల నంపినాఁడు. సేనలను సిద్ధముగా నుంచినాఁడు. గూఢచారుల నియ మించినాఁడు. కోటను కట్టుదిట్టము చేసినాఁడు. తురకసేనలు పాఱిపోకుండ నేర్పాట్లు గావించినాఁడు. అవసరమున కుపయోగపడునని పేరిగానిని చేరఁ దీసినాఁడు. కాని దైవము ప్రతికూలించినది. రాజు చెఱఁగొనిపోఁబడినాడు. అదియు నెంతసహజముగా జరిగినట్లు చిత్రింపబడినది ? ఇందు దేనినేని యసం భావ్యమని మన మనఁగలమా? కథాసంవిధానమున శాస్త్రిగారి యీనేర్పు ప్రతాపరుద్రీయమునం దంతటను గానవచ్చుచుండును. పాత్రల సంభాషణము నకును, శీలపోషణమునకును, కథాసన్నివేశ కల్పనలకును, నింతచక్కగా పొత్తు కుదిరిన నాటకము మఱి యొక్కటి తెలుఁగు భాషలో నా చూచినంతలో కానరాదు. ఇంత బిగువయిన కథా కల్పనముగల నాటకములును నాకుఁ గనుపింపలేదు.

శాస్త్రిగారిట్టి సంఘటనములందు బహుజాగ్రత్తవహించి కథను నడిపి నారు. ఇంకొకటి రెం డుదాహరణములఁ జూపి ముందుకు సాగెదను.

జనార్దనుఁడు తురకల రాక తెలియగనే గోదావరిని దాటు సాధనము లన్నియు నాపుచేయుట కాజ్ఞయిడినట్లు ప్రథమాంకమునఁ జెప్పఁబడినది. మఱి రాజును తురకలెట్లు పడవపై దాటింపఁగల్గిరి ? ఆ పడవ లేల ధ్వంసము చేయఁబడలేదు ? అను ప్రశ్నలు కలుగును గదా ! దానికై శాస్త్రిగా రెంత జాగ్రత్త పడినారో పరికింపుడు.

తృతీయాంకమున విద్యానాథుఁడు పడవపై సిపాయిలతోఁ జేసిన ప్రసంగమున జనార్దనమంత్రియాజ్ఞ యెట్లాచరణములో నున్నది తెలుపఁ బడినది. ఇఁక నీ పడవలు మంత్రియాజ్ఞకు ముందే బయలుదేరి పోవుటచేత వాని కాజ్ఞయందలేదనియు నింకొక చోట సూచితమయినది. మఱి తెలుఁగు

వారు రాజభక్తి లేనివారా ? ఆపడవవారు రాజు నెట్లు దాటించిరి ? అను నదియు నొక ప్రశ్నయే. దానికి నవకాశము లేకుండ కవి మంచి కట్టుదిట్టము చేసినాఁడు. గోదావరి గట్టున పడవవారిని గూర్చి రాజు ఆత్మగతముగా నను కొన్న యీ పలుకు లరయుఁడు.

"వీరికి మమ్ము తెలిపిన వీరు దాటవేయరు. అంతట సిపాయీలు ఈది పోయి వీరినిచంపి పడవలను గట్టునకు చెచ్చి యెక్కించుకొని తామే నడుపు కొని దాటి పోవుదురు. మాదండెక్కడను దృష్టి పథమునలేదు. మాకై వీరేల చావవలయును ?" (48పుట.)

పైమాటలు ఆంధ్రుల రాజభక్తిని మాత్రమే కాదు. ప్రతాపరుద్రుని ప్రజాహితైకతత్పరతను సైతము చాటుచున్నవి.

ఈ విధముగనే ప్రతాపరుద్రీయమునందలి ప్రతి చిన్న విషయమును శాస్త్రిగారు మిక్కిలి జాగ్రత్తతో నిర్వహించుట కాననగును.

## సంభాషణలు నడిపినవిధము

తెలుఁగుభాషయందు కొన్ని నాటకములలో మిక్కిలి దీర్ఘములయి యుపన్యాస ధోరణిలో సాగిపోయిన సంభాషణలున్నట్లును, అవి ఆ యా నాటక ములకు న్యూనతనాపాదించుటకు కారణములయినట్లును తా మిదివఱకే విని యున్నారు.* ప్రతాపరుద్రీయమునం దిట్టి దీర్ఘతరసంభాషణములు కానరావు. ఇందలి సంభాషణములన్నియును సాఫీగా సాగిపోవుచుండును. అవసరమునకు మించి యిందెవ్వరును దీర్ఘముగా మాట్లాడరు. అట్లు దీర్ఘములగు భాషణ ములు ఒక్క పిచ్చివానికి మాత్రమే కూర్చఁబడినవి. అవి వానికి సహజములే గదా !

మఱియొకచోట విద్యానాథునకు నిట్టి భాషణము గలదు. అది విద్యానాథుఁడు పడవనుండి దూకి గోదావరి గట్టున బట్టల నారవేసికొను చున్నప్పటిది. అక్కడనాతఁడొక్కడే యున్నాఁడు. ఇది యాతఁడాత్మగతముగా ననుకొన్నది కాదు కాని అది యేంకాంతస్థలమగుటచే నాత్మగతప్రాయమే. మఱియొక ఘట్టమైనచో నిది యసహజముగాఁగనుపట్టవచ్చునుగాని యిక్కడ నట్లుగాదు.

*రూపకసమాలోచనమున నాకు ముందుపన్యసించినవా రీ విషయమును విపులముగా వివరించినారు.

ఈతని భాషణము వలన మన కనేక విషయములు ఆతని భవిష్య త్కార్యమునకు సంబంధించినవి బోధపడును. బృహత్తర కార్యభారముగల వా డగుటచే నాతని యాలోచన మప్పుడు దీర్ఘతరముగా సాగిన దనుట నాతని యీ భాషణము చెప్పుచున్నది. కనుక నిది సహజముగానే కనుపట్టును. కవిచెప్పలేదు కాని యిక్కడి యీ ఘట్టము నేకపాత్ర ప్రయోజితమయిన శుద్ధ విష్కంభమని చెప్పవచ్చును. (60 పుట.) ఇందు జరిగిన వృత్తాంతమును జరుగఁబోవు కథాంశములును సూచితమయినవి. విద్యానాథుఁడు మధ్య పాత్రయేగదా !

అల్లే తురకలు "టాంజాను"లో నెక్కించికొని పోవుచున్నప్పుడు రాజున కొక దీర్ఘ స్వగతము కూర్చఁబడినది. ఇది కేవల గద్యమయము కాక కొంత పద్యములయందు నున్నది. కావునఁ గొంత మెఱుఁ గనవచ్చును. విశాల త్రిలింగ సామ్రాజ్యము నేకచ్ఛత్రముగాఁ బాలించిన తన్ను దైవ మెంత సుకరముగా శత్రువుల కప్పగించినది రాజు తనలో భావించుట యిక్కడి విషయము.

మఱియొక దీర్ఘ భాషణము చెకుముకి ఖుస్రూఖాను గుఱ్ఱమును కత్తిని సంపాదించి కోటనుజేరు సందర్భములోనిది. ఖుస్రూఖాను సేన నోరుగల్లు సేనలు పోదివి వధించువిషయ మిందు వర్ణింపఁబడినది. యుద్ధమును విష్కంభాదులచే సూచింప వలయునని యాలంకారికుల నియమము. కావున నిదియు పై విద్యానాథభాషణము వంటిదే యని చెప్పవచ్చును. ఇట్టివే మరి కొన్ని దీర్ఘ భాషణము లున్నను మొత్తముమీద నవియు నుచితముగానే యున్నవని చెప్పవచ్చును.

ప్రతాపరుద్రీయము నందలి సంభాషణములఁగూర్చి యింకొక ప్రధాన విషయమునిట ప్రస్తావించుట చాల ముఖ్యము. అది రహస్య సంభాషణములకు సంబంధించినది. ఈ కవి రహస్యములను మాట్లాడింపఁజేయుట కొక చక్కని మార్గము నవలంబించెను. అది యీ రెండు పాత్రల నేదే నొక్కమిషతో దగ్గ ఱకుఁజేర్చి మాట్లాడించుట. దానివలన నితరు లనుమానించుటకైన నవకాశ ముండదు గదా !

చతుర్థాంకమునందు విద్యానాథుఁడు యుగంధరునికడకు వచ్చిన సంద ర్భమున నిట్టిది కాననగును. యుగంధర విద్యానాథులు రహస్యము చెప్పుకొన వలెను. అక్కడ వారేకాక యింకను బలువురున్నారు. మఱియొకరైన

నిక్కడ "జనాంతికముగా"నని సంభాషణములఁ గూర్చియుందురు. కాని శాస్త్రిగా రట్లుగాక మఱియొక చక్కని పద్ధతి నవలంబించినాఁడు.

విద్యానాథుఁడు యుగంధరమంత్రి చూపిన యాసనమునఁ గూర్చు న్నాఁడు. వెంటనే యుగంధరుఁడాతని నిదానించి చూచినట్లు నటించి "విద్యా నాథ మహాకవి యనగా నెవ్వరో యనుకొంటిని. నా ప్రాణమే" అని లేచి యాతనిని కౌగలించుకొన్నాఁడు. ఆ కౌగలింతలోనే విద్యానాథుఁడు యుగం ధరుని చెవిలో ప్రతాపరుద్రుని తురకలు చెరఁబట్టిన విషయమును చెప్పినాఁడు. అదివిని యుగంధరుఁడు మఱలఁ గౌగిలింతలోనే రహస్యముగాఁ దక్షణ కర్తవ్యము నుపదేశించినాఁడు. దీనిని కడమవారు గ్రహింపఁజాలరుగదా!

మఱియొకటి యిట్టిదే సప్తమాంకమునఁ గలదు. వెఱ్ఱివాఁడు ఢిల్లీ వీధులలో వెఱ్ఱికేకలు వేయుచు, దిరుగుచుండును. వాని వెంటనే చారులు వేయికన్నులతో నాతని వృత్తాంతమును కనిపెట్టుటకు యత్నించుచు నా ప్రక్కనుండియే ఖుస్రూఖాన్ వలీఖాను గృహమునకుఁ బోవుచుండుటను చెప్పుకొందురు. ఖుస్రూఖాను వెడలిపోవును. ఈ ఖుస్రూఖాను విషయము యుగంధరునకు చాల ముఖ్యమయినది. దాని నాతఁడెఱుఁగుటకై తనశిష్యుని వానివెంటఁబంపవలయును. తాను శిష్యునితో నీమాట చెప్పిన రహస్య భంగ మయి తాను బయట పడిపోవును. అందుకని వెఱ్ఱివాఁడొక చక్కనియుక్తి నాశ్రయించినాఁడు.

వెఱ్ఱివాఁడు శిష్యుని చెవి పట్టిలాగి "ఇఁక పారిపోవుగదా! ఇఁక పారి పోవుగదా!"అని చెవినులిమినట్లు నటించి "రహస్యం చెప్తా"అని రహస్యముగా వానిని ఖుస్రూ వృత్తాంతమును గనిపెట్టి వచ్చి చెప్ప నియమించును. పిమ్మట వానిచెవిని కొఱికియు "ఛో ఇక నిన్ను నా శిష్యులలో చేర్చను. నాకిక్కడ నగపడితే చంపేస్తా" అని బెదిరించి వాఁడు వెడలిపోవుటకు మార్గమును సుగమ మొనర్చును. వాఁడును "దొంగవెధవ! రహస్యమని వంకపెట్టి చెవి కఱచే శాఁడు" అని తిట్టి వెడలిపోవును.

ఎంత చక్కని యెత్తుగడ! ఇంతయుక్తితో ప్రవర్తించినందుననే చారుల కాతని వర్తనమేమియు దెలియలేదన్న మనకు నమ్మకము పుట్టుచున్నది.

ఈ నాటకములోని రహస్య సంభాషణలను గూర్చియే యింకొక విష యము. అదియు నిట్టియుక్తితోఁ గూడినట్టిదే. రహస్యము చెప్పుకొనవలసిన వారు అందరిముందరనే మాట్లాడుకొందురు. కాని యది యన్యాపదేశముగా

జరుగును. వారిరువురకు మాత్రమే అర్థమగును కడమవారికది గోచరింపదు.

ఇట్టిదొక్కటి సప్తమాంకమున పైసందర్భముననే గలదు. ఖుస్రూఖానును వలీ తలనఱికి మొండెమునురాతితోకట్టి యమునలో పారవైచినాఁడు. తలకాయను యమునఒడ్డున పాతిపెట్టించినాఁడు. ఈ విషయమును శిష్యుఁడన్యాపదేశముగా యుగంధరునితో చెప్పినవిధముఁ జూడుఁడు.

"తాటికాయ నీటికాడ నాటినారయా!
తాటిబొంద నీటిలోన మీటినారయా
కోపగించు తాటికాయ కొంపమాపు తాటికాయ
మాటలాడు తాటికాయ మంత్రమాడు తాటికాయ
రాయిగట్టి రప్పగట్టి రాంబొందు రాతఁగొట్టి
తాటికాయ నక్కయింక తాటిబొంద చేపయింక
వల్లకాటి నల్లసామి చెల్లెలల్ల చూచుచుండ
తాటికాయ.......... ............" (137)

ఈపాట నందఱును విన్నారు. ఒక వెఱ్ఱివానికిమాత్రమే జరిగినసంగతి తెలిసినది. మిగతావారికది వెఱ్ఱిపాటయే. వారికేమి జరిగినది తెలియదుగదా! వెనుకవిషయము తెలియకున్న మనకునంతే.

వెఱ్ఱివానికీ తలమొండెములు చాల ముఖ్యమయినవి. వాని ప్రయోజనమును సాధించుట కవి యుపకరించును. అందుకని యారెంటిని కాపాడునట్లు చూడుమని యాతఁడు శిష్యునకుఁ జెప్పవలయును. అవియు నితరులకుఁ దెలియకుండఁగనే జరిగిపోవలయును. చూడుఁడు పైపాటకు పిచ్చివాని సమాధానపు పాట.

తాటికాయ గోతినుండి తవ్వివేయరా
తాటిబొంద నీటినుండి తవ్వియెత్తరా
తాటికాయ నక్కగాదు తాటిబొంద చేపగాదు
తాడులేక కట్టరాదు తగులఁ గొట్టకుండరాదు
రాయివిప్పి రప్ప విప్పి రాచనక్క రాతగుప్పి
తాటిబొంద తాటికాయ తాచికట్ట దయ్యమౌను

తాటిబొంద మాఱుమూల నాటివేయరా
తాటికాయ బొందతోటి తాచికొట్టరా".......(138)

(సశేషము)

# ఇంద్రధనుస్సు

— శ్రీ మాదిరాజు రంగారావు

ఆకాశంపై వెలసిన ఇంద్రధనుస్సు
కనిపిస్తుంది చాలమంది కంటికి
మనస్సులో విరిసిన ఇంద్రధనుస్సు
చూడగలడా ? అనుకున్న ప్రతిమనిషి.

సాయంవేళ నిద్రాగత సూర్యుని
మస్తిష్కంలో; సముదిత స్వప్నవలయం
చంద్రబింబంలో; స్వీయదేహశిల్పం
అవలోకించే హసనమూర్తి నిశాదేవి.

వెన్నెలవెల్గుకు కందిపోవు స్త్రీరూపం.
చైతన్యసృష్టియొక్క సమాకర్షణాశీలం
ఊహించే జాత్యంధుని మనస్సులో
విరిసిన మృదూహదోహల ఇంద్రధనస్సు.

స్పష్టంగా సంపూర్ణంగా ఒకసారి
మరొకసారి అస్పష్టంగా, వేరొకసారి
సంకీర్ణ వర్ణాలతో, అసంబద్ధక్రమంతో
అగుపించే ఇంద్రధనుస్సు మనకెంతగా
దగ్గరిబంధువో కాస్తగమనించండి
బహువర్గ సామరస్యం అంతటాలభిస్తుందా ?

ఇది సశేష జీవితాన్ని సమగ్రంగా
వ్యాఖ్యానించే చిత్రమంటే సరిపోతుంది.

గ్రుడ్డివాడు అద్దంలో చూచుకొని కళ్ళను
ఆనందములోలీనమై మురిసిపోయినట్లు
కళ్ళువున్నవాడు ఎదుటివాడి ముఖంలో
తనకళ్ళు చూడ్డానికి తహతహలాడుతాడు.

ప్రాభాతవేళ విస్తరించిన సూర్యుని
కరాలకౌగిలినుండి మెల్లగా జారిపోతూ
సహస్రఫణాలు విప్పిన; శతసహస్ర
నటద్భుజంగాలవలె, విజృంభణతో తూగే
తరంగాలతో కదిలే, సముద్రుని మనస్సులో
సప్తవర్ణకీర్ణ మానోహర ఇంద్రధనస్సు.

అస్తమించేవేళ; ఉల్లోలకల్లోల హృదయ
వేదనతో; ప్రగాఢ పరిచితమైన
ప్రేయోసృష్టినుండి, దృష్టి మరల్చుకొనే
సూర్యుని చివరిచూపులలో మిళితమైన
వేదాంతభావనా ఛాయాప్రకామరేఖలో
సప్తవర్ణభేద మంతరించిన కాంతిరేఖ.

సౌందర్యం ఎరుగదు సప్తతంత్రీవీణ
మాధుర్యం ఎరుగదు సప్తవర్ణఖండం.
సప్తవర్ణసౌందర్య విలీనైక కాంతిరేఖ
సప్తస్వర మాధురీసంలీన నాదబ్రహ్మము
ఈ రెండిటి సమాహారము - ఆత్మగత
రసావిష్కారవిశేషక కాంతిగీతం.

ఉనికికి ఆలంబమైన ఆకాశంకోరికపై
సప్తవర్ణ ఇంద్రధనుస్సు అవతరించనట్లు

మానవునిఇష్టంపై జీవితం నియతపూర్వ
వర్ణవై ఖరిలో మలుపులు తిరుగదసలు.

జీవితం యంత్రంలాంటిదెన్నటికీ కాదుసుమా!
అయితే హృదయం; మస్తిష్కంతో పనేలేని
నాగరకతాదృష్టిరహిత శిలాయుగానికి
పూర్వంలోనే, మానవుడు వుండేవాడుకదూ!
పరిణామం ప్రగతిని కాంక్షించే వాదేకాదు.
లలిత కళాసౌందర్యం, విజ్ఞానం ప్రభవించేదా?
ఒక పరమాణువుపై ఆధారపడిన
విశ్వసంస్కృతీ భవిష్యత్తు
ధనవంతునిముఖంలో దీప్తితెచ్చుకున్న
మానవ నాగరకతాప్రకాస్తి

ఎత్తైన ఫ్యాక్టరీగొట్టమునుండి, యంత్రం
గాలిలోవదిలే నీలిగుంపులు
శబ్దశక్తి ఎరుగని అక్షరాలకూర్పు
ఊహాలేని ఆకాశంలా చూడడం
అర్థంచేసుకోలేని గాలిలావినడం -
కాకుండా, విద్యుదూహ చేయగల
మనస్సులోనే సప్తవర్ణధను ఉదయం
ప్రశాంతవిప్లవాని కది మార్గదర్శకం.



వ్యాసము :

# కుమారసంభవము - దృశ్య నిర్మాణశిల్పము

— శ్రీ యస్. బాపిరెడ్డి

కళాతపస్వియు కవికులశేఖరుండు అగు కాళిదాసుని కృతులలోని ప్రత్యేకములగు ఘట్టములను పేర్కొనుటలో యీ నా ప్రయత్నము అందని మ్రానిపండ్లకు అఱ్ఱులు చాచుట వంటిది. ఆతని కవితాప్రపంచమున కుదురుకొనిన సమస్త వస్తుజాల మాహ్లాదకరములే, కాని అన్నిటియందు యిమిడియున్న మాధుర్యము అనుభవించుశక్తి కొలదిమందికి మాత్రమే కలదు. అంతమాత్రమున మిగిలిన సారస్వత అభిలాషుల కా యానందము దుర్లభమాయని శంక కలుగవచ్చును. సృష్టిలోని సమస్త వస్తువులు ఆనందదాయకములే ఐనను అభిరుచిని బట్టి మానవులు కొన్నిటియెడ అత్యంత ఆనందము నెట్లు పొందగలుగుచున్నారో అట్లే మా పాఠ్యములలో నొకటైన కుమారసంభవములోని కొన్ని ఘట్టములు హృదయమున గూండ్లు కట్టుకొని స్థిరనివాస మేర్పరచుకొనుటయే నా యీ వ్యాస రచనకు కారణము. అందు దృశ్య సాక్షాత్కార మొక్కటి.

వేలుపుపెద్దచేత వరములు పొందిన తారకాసురుడు గర్విష్ఠుడై లోకములను వేధింప తొడగెను. అతని ధాటికి ఓర్వజాలక ముక్కోటి దేవతలు ముదిమిచే ముందు వెనుకలు ఆలోచింపక వరములు ప్రసాదించిన చతుర్ముఖుని కడకు పరుగెత్తిరి. ఆతడును ఉగ్ర స్వరూపుడగు శివుని వీర్యముచేత ప్రభవించినవాడు గాని యీతని సంహారింపలేడనియు "దత్పుత్రోదయమునకు కారణభూతురాలగు నగరాజతనయయు హిమవత్పర్వతమున తపస్స మాధి నిష్ఠుడై యాత్మసాక్షాత్కారభూతుడైన మహేశ్వరుని సాన్నిధ్యమున తండ్రి పనుపున పరిచర్య చేయుచున్నది. తపోనిష్ఠాగరిష్ఠుడగు మహేశ్వరుని దృష్టి పార్వతిపై ప్రసరింపజేసిన నాడు గాని ఫలసిద్ధి కాదు. తత్కార్యోన్ముఖులు కం"డని పెదవి కరుచుకొనినాడు ముదుసలి వేలుపు. పిల్లి మెడలో గంట కట్టునదెవరు ? అను సమస్య వ్రాకినది. నాకపతి పేరోలగము నిశ్శబ్దమైనది. ఆలోచనా నిమగ్నుడైన సహస్రాక్షుని చిత్తములో సాక్షాత్కరించినాడు చిత్తభవుడు. స్మరణమాత్రముచేతనే సౌందర్యరాశియగు భార్యకుచేయుచున్న యలంకారములు పూర్తిచేయకయే కొంపమునిగినటుల పరుగిడినాడు పుష్పధన్వి. ఈతని ప్రవేశము నాటకో చితము. ఇతని ప్రవేశపెట్టుటలోనే కవికులశేఖరుని ప్రతిభ కానవచ్చుచున్నది. దేవేంద్రు నంతటివాడు స్మరించుటయే మహద్భాగ్యమైనది మదనునకు. ఆనందముతో మైమరచి ప్రస్తుతాప్రస్తుతములను పరికింపకయే తా జేయగల కార్యములను ఏకరువుపెట్టుచు తుదకు "పుష్పధన్వి నయ్యు నొక్క వసంతుని సహాయమున పినాకపాణినైనను ధైర్యచ్యుతుని గావింప గల" నని పరాకాష్ఠ ముట్టినాడు పుష్పశరుడు. ఇందు నాయకుని యుత్సాహము అతి మాత్రముగ నిరూపింపబడినది. ఇది రసమునకు బీజావాపస్థానము. ఈ సర్గలో వర్ణింప బోయెడి వీరరసమునకు స్థాయీభావమగు ఉత్సాహమునకు పరాకాష్ఠ. ఇకనేమి ! ఆడబోయిన

తీర్థ మెదురైన దింద్రునకు. ప్రకోపించి మన్మథ ఉత్సాహమును దివ్వెకు స్తోత్రవాక్యము లను ఆజ్య మాపాదించి తుదకు ఐరావతాస్ఫాలన కర్కశమైన హస్తముతో మన్మథుని నిమిరినాడు.

ఇంద్ర ప్రేరితుడై రతి వసంత సమన్వితుడై మన్మథుడు సాశంకముగ స్థాణ్వాశ్రమ మున ప్రవేశించెను. ఇచట వసంత వికాసమున గూడ క్రమోన్మీలనము చూపినాడు కవి. ఇచట కాళిదాసు చూపవలసిన విషయములు (1) రాగరంజితమగు ప్రశాంతవాతావరణమున సమాధినిష్ఠుడగు శివుని మహోగ్రరూపము. (2) ఉత్సాహపూరితుడై విజయగర్వమున విఱ్ఱవీగు సూనశరుడు త్రిశూలధారి భయంకర రూపముజూచి నిరుత్సాహుడై సాధ్వస సన్నహస్తుడై స్తంభీభూతుడగుట. (3) చిత్తభవుని ఆశ మొలకెత్తించుటకు సఖీసమేతయగు భార్యను ప్రవేశపెట్టుట... ఇవియే నేటి మన చర్చాంశములు.

అకాలవసంతోదయమున స్థాణ్వాశ్రమ స్థలులన్నియు పుష్పమయములైనవి.

"తపస్వినః స్థాణువనౌకస స్తా
మాకాలికీం వీక్ష్య మధుప్రవృత్తిం
ప్రయత్న సంస్తమ్భిత విక్రియాణాం
కథంచి దీశా మనసాం బభూవుః"

చిత్తవికారము నెఱుగక కోరికల విడచిన తపస్సంపన్నులగు మునులకు వసంత వికాసరూపితములగు పుష్పములు, కోయిల 'కుహూ, కుహూ' ధ్వనులు, కమ్మతెమ్మెరలు కామ వికారమును కల్గింపనేరవు; కాని యకాలవసంతోదయమున విశేషమున్నది. క్రమశః దొరలు కాలములోని వసంతకాలమునకు ప్రత్యేకతలేదు. ఆవసంతుడింతటి సుందర స్వరూపు డును కాడు. అంతేకాక యలవాటుపడినవారి చిత్తములను కాలక్రమమున వచ్చిన వసంత కాలము రాగరంజితములుగా నొనర్ప చాలదు. అకాలవసంతము అట్టిదికాదు. తన హితు డగు రతిపతి ముక్కోటిదేవతల సముఖమున నిండుకొలువులో మహేంద్రునితో ప్రతిన బూని నాడు. కామప్రకోపరూపియగు మన్మథునిలో తానొక భాగమే. అందుచే ప్రతిజ్ఞాపాలనమున మన్మథునికి ఎట్టి దీక్షగలదో తనకును అట్టి పట్టుదల యుండుటయే సహజము. కావుననే సంపూర్ణ స్వరూపముతో విజృంభించినాడు వసంతుడు. కాలముగాని కాలమున వనమెల్ల శృంగారమయ మొనర్చినాడు. కావున తపశ్శాలురకు చిత్తవిభ్రమము కలిగించుటలో ఆశ్చర్యములేదు. జ్ఞాననిధులు తపోదీక్షాధురంధరులు నిగ్రహానుగ్రహసమర్థులుకాన కామ వికారములకు లోబడక ప్రత్యేకశ్రద్ధ తీసికొనిరి జడదారులు. వసంతావిర్భావము కామవికార మునకు నాంది. కోర్కె యనునది ప్రాణికి సహజము. దానిని వ్యక్తపరచుటకు ఉపస్కార కములు కావలె. అచేతనములచే (కవి భావుకుని యూహలో) శృంగారభావోదయము కలుగజేసి చేతనములదెస మరలినాడు. పరిధులను పరికించుచునే ప్రాణులచే శృంగారచేష్ట లను ప్రకటింపజేసినాడు. ఔచితీపాలనమున కాళిదాసు అందెవేసినచేయి యని యెల్లరకు విదితము. తుదకు శివసాన్నిధ్యమున అప్సరోగీతులు వినిపించినాడు. ఇట్టి కామ ప్రకోప కములు ఎన్నియున్నను పరమాత్మ జ్ఞానవిముఖుడు కాలేదని చెప్పుచు– సహజముగా

దివ్యాంగనాగానము సమాధిభంజకమే యైనను చిత్తస్వాధీనముగలవారికి అంతరాయములు అత్మానుసంధానమును తొలగించునవి కావని సమర్థించుచు అర్థాంతరన్యాసమును చేసినాఁడు.

ఇచట కాళిదాసు రెండు విరుద్ధభావములను పోషింపవలె. (1) భయము, (2) శృంగారము. సహజముగ కాళిదాసు శృంగారప్రియుడైనను కథాసందర్భమును అనుసరించి ప్రతిరసమును బారము ముట్ట జూపగల శక్తి వానికి గలదు. అద్దములో రూపము ప్రతిబింబించునట్లు నిర్మలమగు నిశ్శబ్దవాతావరణమున శివుని భయంకరరూపము భావుకుని మనఃఫలకమున చూపింపవలెను. ఇదియే కాళిదాసు కవిత్వమందలి యుత్తమత్వము. "శ్రుతాప్సరోగీతి రపి క్షణేస్మిన్"అను శ్లోకమున చలింపక తపోనిష్ఠలోనున్న శివుని యాకృతి గోచరించుచున్నది. "లతాగృహద్వారగతోऽథ నన్దీ" అనుశ్లోకమున నందీశ్వరుడు జాగ్రదవస్థలోనెడమచేత బెత్తమునుబట్టి చూపుడువ్రేలు నోటిమీద వుంచుకుని ప్రమథగణములను అల్లరి చేయకుడు అనినట్లు సైగచేతనే శిక్షించుట గోచరించుచున్నది. ఈ యాజ్ఞతో శివుని పరిసరప్రదేశములన్నియు నిర్మలముగ ప్రశాంతముగ నొనర్చుటయేకాక చీమ చిటుకన్న వినబడు నిశ్శబ్ద వాతావరణ మేర్పరచినాడు కవి. అంత నిశ్శబ్దత చేకూర్చిననాడుగాని వాని భయంకర రూపము స్పష్టముగ గోచరింపదు. అంతేకాదు, ఈ నిశ్శబ్దతలో భావుకుని తనతో తీసికొనిపోయి యాతని ఏకాంత ప్రశాంతమగు మనస్సునకు శివునిరూపము సాక్షాత్కరింపజేయ సంకల్పించినాడు కాళిదాసు. ఇదియే దృశ్య సాక్షాత్కారము. ఇది కాళిదాసు కావ్యములలో అడుగడుగునను గోచరించును. అన్నింటిని పేర్కొనుటకు యిది యదనుగాదు. కావున నొకటి రెండు ఘట్టములందే వినోదింతము. అంత నిర్మల వాతావరణము చేకూర్చియు తృప్తి చెందలేదు కాళిదాసు. ప్రాణి నిశ్శబ్దముగనున్నను కరచరణములచే వింతచేష్టలు సేయ నవకాశము కలదు. దానికిగూడ తావులేకుండ

> "నిష్కమ్ప వృక్షం నిభృత ద్విరేఫం
> మూకాణ్డజమ్ శాన్త మృగ ప్రచారమ్
> త చ్ఛాసనాత్ కానన మేవ సర్వం
> చిత్రార్పితారమ్భ మి వావతస్థే."

ఆ నిశ్శబ్ద మిచట పరాకాష్ఠనంది ఫలోన్ముఖమైనది. చరములేకాక చెట్లు సరీసృపాదులు గూడ నందీశ్వరుని యాజ్ఞకు లోబడి నిత్య వ్యాపారముల విడచి నిశ్చేష్టితములై యుండుటచే ఆ యడవి పటమునందు వ్రాయబడినట్లుండెను. ఈ పటమునందు భావుకుడుకూడ ఒక చిత్తరువే యగును. ఇదియే కాళిదాసుని ప్రతిభ. తాను చెప్పవలసినది చూపవలసినది పారము ముట్ట కరువుదీర జెప్పిచూచుటయే యాతని యాశయము. ఇట్టి నిశ్శబ్ద వాతావరణమున జాగ్రదవస్థనున్న నందీశ్వరునికంట పడకుండ శివసాన్నిధ్యము చేరుటకే మన్మథునకు తలప్రాణము తోకకు వచ్చినది. ఆ నిశ్చలత్వములో డాగిన భయంకరత్వము యొక్క రూపూహించినంతనే రూపరహితుడయ్యెను మన్మథుడు.

వెనువెంటనే భయంకర స్వరూపుడగు భవుని రూపము సప్తశ్లోకములను రంగులతో సరిదిద్ది భావుకునకు సాక్షాత్కరింపజేసినాడు. నిశ్శబ్దత వెల్లివిరిసిన యాప్రదేశమున దేవదారు

చెట్టు మొదట వితర్దిపై తపస్సమాధిలోనున్న పరమేశ్వరుని చూచుసరికి కన్నులు చీకట్లు కమ్మినవి మన్మథునకు. క్రిందకువంచిన శిరము నెమ్మదిగ పైకెత్తుచు భయంకరస్వరూపమును జూడ మొదలిడెను. ఇందుకూడ కాళిదాసు క్రమము తప్పడయ్యెను. చెట్టు మొదట అరుగుపై పులితోలు పరచియుండగా దానిమీద పరమేశ్వరుడు వీరాసనము ధరించెను. తొడలనడుమ హరుని కరయుగము తామర పూచినట్లుండెను. పాములతో జడల నెత్తికట్టి జపమాల తగిలించి కంఠకాంతిచే నీలిమను అభివృద్ధిపరచు నల్లచారల లేడి చర్మమును ధరించి యించుక కాంతిగలయట్టియు భయంకరములు నగు నల్లగ్రుడ్లు కలిగి కదలని కనురెప్పలు గలిగి క్రిందు ముఖముగా నున్న కిరణ ప్రసారములను నాసమందు లక్ష్యముగా నునిచి తపోనిష్ఠయందుండెను. ఈవర్ణనమంతయు బాహ్యముగ తపోనియమానుసారములట్లు గోచరించినను అంతర్గతముగ శివుని రూపమును భావుకుని హృదయమందు సాక్షాత్కరింప జేయుట కుపస్కారకములు. ఇంతేగాక బాహ్యగతమగు శివుని రూపమునే యింతవరకు మనకు జూపినాడు. ఇక నంతర్గత రూపమును జూపుటకు ఉపక్రమించినాడు.

> "అవృష్టి సంరమ్భ మి వామ్బువాహ
> మపా మి వాధార మనుత్తరంగమ్
> అంతశ్చరాణాం మరుతాం నిరోధా
> న్నివాత నిష్కమ్ప మిచ ప్రదీపమ్."

ఇది శివుని యంతర్మూర్తి. సమాధినిష్ఠుడగు ఈశ్వరుడు వాయునిరోధము చేసియుండ వృష్టిసంరమ్భములేని మేఘునివలెను మీదికలలురేగని హ్రదమువలెను నివాత నిష్కమ్ప ప్రదీపమువలె నుండెనని త్రివిధ ఉపమాసామగ్రిచే నిరూపించియున్నాడు. ప్రథమ ద్వితీయ తృతీయ ఔపమ్యములచే సర్వవాయు నిరోధములు నిరూపింపబడినవి. అంతేగాక మొదటి దానిచే భీకరత్వము రెండవదానిచే గాంభీర్యము మూడవదానిచే జ్యోతిర్మయత్వము ఇచట వ్యక్తములగుచున్నవి. యోగాసనస్థుడైన యీశ్వరుని శాంత గంభీర స్వరూపమును కాళిదాసు మనయెదుట పెట్టుటకు ఉపయోగించిన యీ శ్లోకమునందలి శైలియు శాంత గంభీరమై వెలసినది. "ఉపమా కాళిదాసస్య" అను నుడియొక్క సార్థక్యము యిందు గోచరించుచున్నది. కాళిదాసుని యుపమాలంకారములు దృశ్య సాక్షాత్కృతిని సులభము చేయుటలో ఒక ప్రత్యేకతను వహించియున్నవి. ఆత్మసంధానపరుడగు భవుని బాహ్యగత స్వరూపము నిశ్చలముగా నున్నను వృష్టిసంరంభములేని మేఘునివలె భీకరత్వమునే గొలుపుచుండెను. అలలురేగని హ్రదమువలె హృదయము నిర్మలమై గంభీరముగ గోచరించెను. నివాత నిష్కంపప్రదీపము వలె జ్యోతిర్మయత్వము వెలుగొందెను. తపోదీక్షచే నగ్ని కపాలముగుండ బయలుదేరి బాల చంద్రుని వాడించుచున్నది. నవరంధ్రములనుకట్టి మనసు స్వాధీనపరచి క్షేత్రజ్ఞులు ఎవనిని తెలిసికొందురో యట్టి తన్ను తనయందే సాక్షాత్కారము చేసికొనుచున్న శివుని వుగ్రరూపము చూచి భయముచే సాధ్వసస్నిహస్తుడై శరచాపములువీడి హతాశుడైనాడు మన్మథుడు. ఇది కాళిదాసుని పరిపూర్ణమూర్తిచిత్రణము. ఈ యచేతనత్వము మన్మథునకేకాదు— ఆ వాతావరణములో అట్టిరూపమును చూచిన ప్రతియొక్కనికి ఆపాటు తప్పదు.

చైతన్యరహితుడైన మన్మథుడు చేయునది లేక నిరాశుడై యాశలు పరికించినాడు. ఇట్టి సమయమున

"నిర్వాణ భూయిష్ఠ మథాస్య వీర్యం
సంధుక్షయ న్తీవ వపు ర్గుణేన
అనుప్రయాతా వనదేవతాభ్యా
మదృశ్యత స్థావరరాజకన్యా"

ఇందు 'స్థావర రాజకన్యా' 'అదృశ్యత' అనునవి సాభిప్రాయములు. నిరాశుడై నిర్వీర్యుడై దేబెమొగమువైచి దిశలు పరికించు మన్మథుని దృష్టికి తళుక్కని మెఱపువోలె పార్వతి సఖీసమేతయై పొడకట్టెను. విద్యుల్లతవలె వియత్తలముననే విహరించి మఱుగు పడలే దామె. నిజముగనే యాపెను చూచినాడు మన్మథుడు. దానితో నష్టప్రాయమైన మన్మథుని బలము తిరిగి రేకెత్తెను. ఆశ పొడసూపెను. ఆపెరాక తన్ను కార్యోన్ముఖునిగా నొనర్చుచున్నట్లు భావించెను. ఆపె వచ్చుచున్న మార్గమునకు తన దృష్టి ప్రసరింపజేసి తేరిపారచూచెను.

"అశోక నిర్భర్త్సిత పద్మరాగం
ఆకృష్ట హేమద్యుతి కర్ణికారమ్
ముక్తా కలాపీకృత సిన్దువారం
వసన్త పుష్పాభరణం వహన్తీ."

మన్మథుని మసక మసక దృష్టికి వసంత పుష్పాలంకృతయైన పార్వతి రూపములో మొదట పువ్వుల రంగులే యతనికి గోచరించెను. అదియొక మెఱపు ! కాదు స్థావరముగ నున్నదే ! యారూపము. స్థావరమేకాదు. జంగమత్వముగూడ వహించినట్లున్నదే. లేనిచో ఆ రంగులు కదలాడుటెటు ? రంగులుకాదు. స్త్రీ మూర్తియే.

"ఆవర్జితా కిఞ్చిదివ స్తనాభ్యాం
వాసోవసానా తరుణార్కరాగమ్
పర్యాప్త పుష్ప స్తబకావనమ్రా
సంచారిణీ పల్లవినీ లతేవ"

కదలాడు తీగవలె నడచివచ్చు పార్వతినిచూచి మన్మథుడు నిజముగా పార్వతియని పోల్చినాడు. కొంచెము దగ్గరగా సమీపించుటచే కట్టిన చీరకూడ పోల్చుట సులభమైనది. అది బాలసూర్య ప్రభలచే వెలుగొందుచున్నది. అంతేకాదు.

"స్రస్తాం నితమ్బాదవలమ్బమానా
పునః పునః కేసరదామ కాఞ్చీమ్
న్యాసీకృతాం స్థానవిదా స్మరేణ
మౌర్వీం ద్వితీయామివ కార్ముకస్య"

కటిస్థలాభరణమైన పొగడపూదండ మాటిమాటికి జారుచుండ ప్రయత్న పూర్వకముగ దాని నాపుచున్న పార్వతిచర్య కానవచ్చినది. ఇచట మనము గమనింపవలసిన విషయము

వేరొండు గలదు. భావుకునకు పార్వతియొక్క దృశ్యము సాక్షాత్కరింప జేయుటయు మన్మ థుని యాశాలతను తిరిగి చిగురింప జేయుటేగాక యకాల వసంత వికాసమునకు లొంగక యాత్మసంధానపరుడైన శ్మశానవాసి చితాభస్మధారి వృద్ధవృషభచారి కపాలధారి భుజగహారి వికారియునైన మహేశ్వరునియందు చిత్తవిభ్రమము కలుగచేయు ఘట్టము ముందుండుటచే పార్వతి నింత సౌందర్యరాశిగా చిత్రించినాడు. విలాస చేష్టితమైన చలనసౌందర్య మిందు తీర్చి దిద్దినాడు.

"సుగన్ధి నిశ్వాస వివృద్ధ తృష్ణం
బిమ్బాధరరాసన్న చరం ద్విరేఫమ్
ప్రతిక్షణం సంభ్రమలోల దృష్టి
ర్లీలారవిన్దేన నివారయన్తీ"

ఆమె పెదవియొద్ద కదలియాడుచున్న తుమ్మెదయు పార్వతియొక్క విలోల దృష్టియు మన్మథునకు స్పష్టముగా గోచరించెను. ఈ శ్లోకమున జగన్మాతయగు పార్వతి సౌందర్యావధి రేఖలు చిత్రితమైనవి. పద్మినీజాతి స్త్రీయగుటచే ఆమె నిట్టూర్పులు సుగంధమిశితములు. తుమ్మెద పేరాసతో బింబాధర సమీపమున తిరుగాడ జొచ్చెను. తద్బాధ కోర్వలేక పార్వతి విలోల దృష్టయై హస్తగతమైన లీలారవిందముచే తుమ్మెదను జోపవలసి వచ్చెను. సౌందర్య ఖనులైన కాళిదాసుని నాయికలకు యిట్టి భ్రమరబాధ చిత్రించు టొక పరిపాటి. దానివలన నాయికల విలాస చేష్టితములను వ్యక్తముసేయుట కిదియొక యదను. ఇచట బింబాధరమును బాధించుభ్రమరమును లీలారవిందముచే నివారించు దృశ్యము భావుక హృదయైక గోచరము. భావబలమున అట్టి చిత్రము కానవచ్చినచో పాఠకుని హృదయము వది పీడదు. అట్టి మధుర దృశ్యము యిందు చిత్రితమైనది. ఆమె రూపురేఖావిలాసములు తనకార్య సాధన కుపస్కారకము లగునని తేరుకొనినాడు మన్మథుడు.

"తాం వీక్ష్య సర్వావయవానవద్యాం
రతేరపి హ్రీపద మాదధానామ్
జితేంద్రియే శూలిని పుష్పచాపః
స్వకార్యసిద్ధిం పునరాశశంసే."

అన్ని అవయవములయందు నిర్దుష్టురాలై చక్కదనమున రతిని వెక్కిరించు పార్వతీ దేవిని చూచి మారుడు తిరిగి స్వకార్యసిద్ధిని కోరెను. ఇట్టి దృశ్యసాక్షాత్కారములు కాళి దాసుని కవిత్వమున కొకొల్లలు. అన్నియు నిచట పేర్కొనుట కవకాశములేదు.

"వివృణ్వతీ శైల సుతాపి భావం
అంగైః స్ఫురద్బాలకదమ్బకల్పైః
సాచీకృతా చారుతరేణ తస్థౌ
ముఖేన పర్యస్తవిలోచనేన."

అనుపట్ల మన్మోహన శృంగార భావస్ఫోరకమగు పార్వతి పరువంపురూపును

"సదక్షిణాపాఙ్గ నివిష్టముష్టిం
నతాంస మాకుఞ్చిత సవ్యపాదమ్
దదర్శ చక్రీకృత చారుచాపం
ప్రహర్తు మభ్యుద్యత మాత్మయోనిమ్."

అనుపట్ల బాణమును వింట సంధించి నారి చెవికొనవఱకు లాగిన చిత్తభవుని చారుతర మోహనాకృతియు

"ఋజుతాం నయత స్మరామి తే
శర ముత్సఙ్గ నిషణ్ణధన్వనః
మధునా సహ సస్మితాం కథాం
నయనోపాన్త విలోకితం చ యత్"

అనుచోట బాణమును తిన్ననచేయుచు వసంతునితో ఉత్సాహకరముగ మాటాడుచు మధ్య మధ్యమమున శృంగార సుహాసినియగు భార్యవైపు దొంగచూపులు చూచు మన్మథుని హొయలు

"తం వీక్ష్య వేపథుమతీ సరసాఙ్గయష్టి
ర్నిక్షేపణాయ పదముద్ధృత ముద్వహన్తీ
మార్గాచల వ్యతికరాకులితేవ సిన్ధుః
శైలాధిరాజతనయా నయయౌ నతస్థౌ"

అనుపట్ల పార్వతిమనస్సున చెలరేగిన భావపరంపరలోని పెనగులాటయు తొట్రుపాటును ఇట్టి వెన్నియో లెక్కకుమీఱి కాళిదాసుని కవితోద్యానమున విచ్చలవిడిగ ముచ్చటగ నలంకరించు కొని దాగుడుమూత లాడుచుండును. అన్నిటిని ఈసమయమున పేర్కొనలేము. ఇట్టిప్రతిభ కలవాడు కావుననే కాళిదాసు శాశ్వత యశశ్శరీరుడైనాడు. నావ్యాసమునందు నే చూపబూనిన దృశ్య సాక్షాత్కారము కొందరకు గోచరము కాకపోవచ్చును. అందుచేతనే యభిరుచినిబట్టి ఆనందమని మొదటనే పేర్కొంటిని. ఈ వ్యాసమున పార్వతిరాకను గమనించుచున్న మన్మథుని తలపులు నిజముకావు. కాని దృశ్య సాక్షాత్కారమునకు సాధనములుగా కల్పింప బడినవే.



కవిత :

# శతపత్త్రము

—శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

తెరువు చూపింపుమనిన నీ తెఱగదేల
తెఱవ ! వెన్నెల కన్నుల బరువదేల
బరువు మోసినయట్లు సంభ్రమ మదేల
దారి చూపింపవే ఉపకారబుద్ధి.

కఱవు చూపులనిల్పి చిత్తరువువోలె
బిత్తరీ ! ఏల నన్ను స్తంభింపజేతు
దారి దొంకయు తెలియనితనమె గాక
పత్తనమ్మునకేమొ నే క్రొత్తవాడ.

తూగిపాడగ కదన కుతూహలమ్ము
ఇట్టెపొంగితి వమృత వాహినిని పాడి
రాగములు వేరెయైనను రక్తియొకటె
రసములొలికించు పట్టున బిసరుహాక్షి.

పలుకరించును నీ తళత్తళలు నన్ను
వెన్నెలలలోన వన్నెల విసనకఱ్ఱ !
బిఱ్ఱువిడలేని అడవిలో వెన్నెలగును
పరువమైనట్టి నాదు జవ్వనము బేల

ఎన్నడునుకాని ఇట్టిపాటెఱుగ ఎఱుగ
కదలనీయవు చూపుల కట్టి కట్టి
కట్టువడుటనుకూడ సుఖమ్మె కనుట
భామ ! వాంఛింతు నహరహ బంధనమ్ము.

తాన యన నీవు నేను తందాన యందు
కొమ్మ ! నీవాడ నేను తాళమ్ము వేతు
పాలనో లేక నీట - నీ పాలబడిన
నన్ను ముంచంగదగు, లేడికన్నుదాన !

చేడె ! వేటాడె దే మగజీవినైన
కనుబొమలతోడ సగముచూపునె లగించి
దండనుండిన నీవు వేదండయాన !
భావజుని మార్గమే సులభమ్ము నగును.

ముసరు ప్రణయమ్ము చెలియ నీమోముపైన
దాచుకొనెదవు నాయెద దోచుకొనియు
ముసురుపట్టెను ధనువును మొనసిపట్టె
కంతుడిక అంతులా ? మొనకసురు మాను.

జాడుజాడుగకొట్టె నీజాడకనుమ
తియ్యవిలుకాడు బాణమ్ము తిగిచిపట్టి
దుయ్యబట్టెద నతని నుద్ధరత మెఱసి
నెయ్యపుం గిన్క మానవే ! నీవు చెలియ.

మించు బోడిరొ ! గ్రుడ్లప్పగించి చూతు
నావయిపు ప్రొద్దుతిరుగుడు పూవువోలె
ఆశపడితిని నిన్ను కన్నంత నేను
అంతలో నేల అగుదువే అత్తిపత్తి.



# అధ్యక్షోపన్యాసము
# 20 వ ఆంధ్రప్రదేశ హిందీ ప్రచారక సమ్మేళనం
## విజయవాడ

— *పద్మశ్రీ మోటూరి సత్యనారాయణ*

ప్రస్తుత రూపంలో, ఆంధ్ర ప్రదేశ్ భారత దేశంలో ప్రత్యేక ప్రాముఖ్యత వహించి ఉన్నది. వైశాల్యం, సాంస్కృతిక వాతావరణ పారంపర్యము, ఉదార దృష్టి మొదలగు వానితో చూచినప్పుడు భారతీయ సాంస్కృతిక చరిత్రలో ఆంధ్ర ప్రదేశ్‌కు విశిష్టస్థానం కలదు. ఈనాడుకూడా ఈ ప్రాంతం దేశ పున ర్నిర్మాణోద్యమంలో వెనుకబడిలేదు. జాతీయతా ఉద్యమంలో తన కర్త వ్యాన్ని ఈ ప్రాంతం పూర్తిగా నిర్వహించింది. వ్యాపక దృష్టితో, ఉదార హృదయంతో, ప్రగతిశీలమైన గమనంతో, ఉన్నతాదర్శాల కొరకై ఈప్రాంతం పనిచేసింది. దేశ నాయకులు ఉన్నతాదర్శాలను దేశంముందు ఉంచినారు. పత్రికా రచయితలు, కవులు, కళాకారులు సాహిత్యాభిమానులు ఆంధ్ర భాషలో సృజనాత్మకమైన కృషినిచేసి ఈ ప్రాంత గౌరవాన్ని ఇనుమడింప చేశారు. జాతీయతను పరిపుష్టంచేసి జాతీయైక్యతను నిర్మాణంచేసే హిందీ ఉద్యమంలోకూడా ఈ ప్రాతం అదేవిధంగా ముందంజవేసింది. దేశంలో ఐక్యతా సూత్రాలను బలపరచడంలోనూ, దేశనాయకులు నిర్దేశించిన కార్య క్రమాలను కొనసాగించడంలోనూ నిష్ఠతో కార్యదక్షత గలిగి పనిచేసిన హిందీ ప్రచారకులకు అందరికీ నా హృదయ పూర్వకమైన ధన్యవాదములు.

గడచిన నలభై సంవత్సరాలనుండి హిందీ ప్రచారోద్యమం వివిధ దశలలో వికసించి ఈనాడు సంపూర్ణ వికాసావస్థను పొందినది. మొదటి పది సంవత్సరాలు ఈ ఉద్యమం మన దేశీయుల హృదయాలను కలిపివేయుటకు కేవలం బీజములను మాత్రమే నాటింది. రెండవ దశాబ్దంలో ఆ బీజాలను తడిపి వానినుండి బయలువెడలే అంకురాలను పోషించింది. మూడవ దశాబ్దంలో తన స్వరూపాన్ని తాను గుర్తించి తన వృద్ధిని అంచనా వేసుకొని దానిలో కలిగిన హెచ్చు తగ్గుల కారణంగా ఉత్పన్నమయిన సంఘర్షణలను దూరంచేసి సమ భావంతో సామరస్యాన్ని అభివృద్ధి చేయడానికి ప్రయత్నించింది. ఈ విధంగా ముప్పై సంవత్సరాల వయస్సు గడచిన తరువాత అదృష్టవశము

వలన మన దేశానికి స్వాతంత్ర్యం లభించింది. స్వాతంత్ర్యం ప్రాప్తించిన వెంటనే అంతవరకు స్వరాజ్య ప్రాప్తిని ఉద్దేశించి ఐక్యతా నిర్మాణానికి కృషి చేస్తూ ఉన్న హిందీ ఉద్యమ స్వరూపం మారిపోయింది. స్వరాజ్యభాష ఏమి? అన్ని భాషలకు స్వరాజ్యం లభిస్తుందా? లేక ఒక భాషకేనా అనే సమస్య దేశాన్ని ఎదుర్కొన్నది. అందువలన మన ప్రతినిధులు అందరూ రాజ్యాంగ విధాన సభలో భారతదేశంలోని భాషలన్నీ వృద్ధి పొందగలవనీ, స్వరాజ్యం అన్ని భాషలకూ లభించగలదని నిర్ణయంచేశారు. నూటయాభై సంవత్సరాల నుండి తనకు లభించిన అధికారం ద్వారా ఇంగ్లీషు ప్రాంతీయ భాషలను అణచివేసినది. ఇంగ్లీషును తొలగించి దాని స్థానంలో ప్రాంతీయ భాషలు ప్రవేశపెట్ట బడగలవనీ, ఆ పని భారతజాతి సామూహిక కార్యక్రమాన్ని నడిపించుటకు జరుగగలదనీ మన ప్రతినిధుల నిర్ణయం. ఈ నిర్ణయం జరిగి పది సంవత్సరాలైనది. ఈ పది సంవత్సరాలలో మన పని అధికంగా వృద్ధి పొందింది. సాహిత్యం. సంస్కృతి మొదలగునవి శక్తివంతమైనవి.

ది. 26-11-1949 న మన నాయకులు జపించిన మంత్రం ఈ నాడు కూడ భారతదేశమంతటా ప్రతిధ్వనిస్తున్నది. ఆ మంత్రం ఇది:

"ఇండియా ప్రజల మగు మేము, ఇండియాను సంపూర్ణ ప్రభుత్వ సంపన్న లోకతంత్రాత్మక గణరాజ్యముగ నెలకొల్పుటకును, మరియు అందరి పౌరులకు సామాజిక, ఆర్థిక, రాజకీయ విషయములలో న్యాయమును; భావ, భావప్రకటన, విశ్వాస, ధర్మ, ఆరాధనల విషయములలో స్వాతంత్ర్యమును; సమాన అవకాశ ప్రతిపత్తులను; చేకూర్చుటకును మరియు వారందరి యందును వ్యక్తిగౌరవమును, రాష్ట్రైక్యతను పురికొల్పి సౌభ్రాతృత్వమును పెంపొందించుటకును భక్తి పురస్సరముగ తీర్మానించుకొని 1949 వ సంవత్సరము నవంబరు నెల ఇరువది యారవ తేదీన మా సంవిధాన సభయందిందు మూలముగ ఈ సంవిధానము నంగీకరించి అధినియమము చేసి స్వీకరించిన వారమైతిమి."

ఈ నాడు మనకు ఒక రాజ్యాంగ చట్టము రూపొంది ఉన్నది. దాని ననుసరించి మన రాజ్యాంగ యంత్రము నడుపబడుచున్నది. దాని ననుసరించియే ఈ యంత్రాన్ని నడిపించువారికి అధికారములు లభించి ఉన్నవి. అది మన సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ జీవితములో పూర్తిగా వ్యాపించి

ఉన్నది. ఆ చట్టము ననుసరించి ప్రతి నాగరికుని అధికారములు రక్షింపబడు చున్నవి. తమ తమ శక్తి ననుసరించి సంపూర్ణ వ్యక్తిత్వాన్ని పొందుటకు అవసరమైన స్వాతంత్ర్యం, సమాన అవకాశాలు అది మనకు ప్రసాదిస్తున్నది. మన జీవితముతో సంబంధం కలిగిన అనేక ఇతర సమస్యలతో బాటు వివిధ భాషలకు సంబంధించిన సమస్య కూడ ఈ రాజ్యాంగ చట్టంలో చర్చించబడి నది. పదిహేడవ అధ్యాయంలో ఈ చర్చను మనం చూడవచ్చును.

రాజభాషా కమీషన్‌వారి నివేదిక ప్రకటింపబడి ఆ నివేదికపై తమ అభిప్రాయాలను చెప్పుటకు పార్లమెంటరీ హిందీకమిటీ నిర్మింపబడిన తరువాత హిందీకి వ్యతిరేకంగా ఒక పెద్ద తుఫాను బయలుదేరింది. హిందీభాష హితాన్ని కాంక్షించేవారికి ఎటువంటి బాధ ఉన్నదో ఈ తుఫానును లేవగొట్టిన వారికి కూడా అటువంటి బాధే ఉన్నదని చెప్పబడుతున్నది. హిందీ అభిమానులు హిందీ లేకపోతే దేశంలో ఐక్యత విచ్ఛిన్న మవుతుందని అంటూవుంటే, హిందీ ప్రవేశించడంవల్లనే ఐక్యత విచ్ఛిన్న మౌతుందని హిందీని వ్యతిరేకించేవారు అంటు న్నారు. ఈనాడు హిందీకి వ్యతిరేకంగా మాట్లాడేవారిలో చాలామంది మొదట హిందీకొరకై కృషిచేసినవారే. అట్టివారిలో ఈనాడు ఆకస్మికంగా ఈ మార్పు ఎందుకువచ్చిందో? దానికి కారణాలు ఏమిటి? అన్న విషయాన్ని గురించి చర్చించడం అసంగతం కాదనుకుంటాను.

హిందీ ప్రచారానికి నాలుగు స్వరూపాలు ఉన్నవి. భారతదేశంయొక్క సార్వదేశికస్వరూపాన్ని బలపరచేది ఒకటి. దేశంలోని విభిన్న సంస్కృతులను పోషించుకుంటూ తద్వారా భారతీయసంస్కృతిని వికసింపజేసేది రెండవ రూపం. విభిన్న భాషలలో గల సాహిత్యానికి సంబంధించిన ఆదాన ప్రదా నము ద్వారా దేశవాసు లందరినీ ఉన్నతికి తెస్తూ భారతీయతను ప్రతిబింబింప జేసే భావాలను వ్యక్తంజేసే రూపం మూడవది. నూతనముగా మనం నిర్మించు కొన్ని స్వరాజ్య యంత్రాన్ని నడిపించే భాషామాధ్యమ రూపం నాలుగవది మొదటి మూడు రూపాలకు సంబంధించినంతవరకు ప్రస్తుతం వివాద మేమీ లేదు. వివాదమంతా నాలుగవ రూపమునకు మాత్రమే సంబంధించి ఉన్నది. భారతీయ రాజ్యాంగ విధానాన్ని నడిపించు బాధ్యతను హిందీ వహించలేదని హిందీ వ్యతిరేకవాదులు అంటున్నారు. ఇంగ్లీషువంటి శక్తిమంతమైన భాషను తొలగించి హిందీని భారతసంఘ భాషగా స్వీకరించుట అవాంఛనీయమే గాక ప్రమాదకరమని కూడా హిందీ వ్యతిరేకుల వాదం. దానివల్ల దేశ ఐక్యత

బలహీనపడుటయే గాక హిందీభాష మాట్లాడేవారు బలవంతులై ఇతరభాషలు మాట్లాడేవారిని తమకు బానిసలుగా చేసుకొనగలరని కూడా హిందీ వ్యతిరేక వాదులు అంటున్నారు.

ప్రస్తుతం ఇంగ్లీషు ఉన్న స్థానాన్నిబట్టి ఇటువంటి భయం కలుగుతున్నది. ఇంగ్లీషు ప్రాంతీయభాషలను అణచివేసింది. అదేవిధంగా హిందీకూడా అణచి వేయగలదని వారి భయం. దురదృష్టవశము వలన ఇంగ్లీషువారు వెళ్ళిపోయి నప్పటికీ వారు స్థాపించిన రాజ్యవ్యవస్థా స్వరూపం ఉన్నదున్నట్లుగా మనదేశంతో ఉండడంవల్ల ఈభయం మరీ ఎక్కువ అవుతున్నది. భారత ప్రభుత్వాన్ని పరిపుష్టం చేయడానికి ప్రస్తుతం ఉన్న రాజ్యాంగవ్యవస్థ ప్రయోజనకరంగా ఉన్నప్పటికీ రాజ్యశక్తిని పెంపొందించుకొనుటకు రాజ్యశక్తిని వికేంద్రీకృతం చేయవలసిన రోజు ఎప్పుడో ఒకప్పుడు రాకతప్పదు. రాజ్యశక్తిని వికేంద్రీకృతం చేసినప్పటికీ మన ఐక్యతచెడిపోకుండా ఉండుటకు అవసరమైన విషయాలన్నీ మన రాజ్యాంగంలో ఉండనేఉన్నవి. మనఉద్దేశ్యాలుకూడా అదేదిశలో పయనిస్తున్నవి. లేకపోతే భాషలను ఆధారంగా చేసుకొని రాజ్య పునర్నిర్మాణాన్ని జరిపించి బ్రిటిష్‌వారి కాలంలో 27 గా ఉన్న రాజ్యాలను 14 గా మార్చేవారమే కాము. దక్షిణంలో నాలుగు ప్రాంతాలు, తూర్పున 3 ప్రాంతాలు భాషలు ఆధారంగా ఏర్పడేవి కాదు. ప్రస్తుతం ఒకటి రెండు ద్విభాషా ప్రాంతాలున్నా వాటి సమస్యను పరిష్కరించడానికి మనం ఆలోచనలు చేసేవారమే కాము. కనుక ఈనాడు మన ముందుఉన్న సమస్య హిందీయా ఇంగ్లీషా అని కాదు. ఇంగ్లీషుభాషా లేక ప్రాంతీయభాషా అన్నదే ఈనాటి మన సమస్య. ప్రాంతీయభాషలను సాధనంగా స్వీకరించి ప్రజాస్వామ్య సిద్ధాంతాలను మనం అమలు చేయగలము. ఆనాడే ప్రజాస్వామ్య విధానం అభివృద్ధిఅయి ప్రజల సంస్కృతి వృద్ధికి రాగలదు. ఆనాడే ప్రజాశక్తిలో గల వ్యాపక స్వరూపాన్ని మన సామూహిక జీవితంలో ప్రతిబింబింప జేసుకొనగలము. వ్యక్తివాదము సంఘవాదము ఈ రెండింటి మధ్య సామంజసభావాన్ని పెంచుటకు చేయు కృషిలో వచ్చే ఆటంకాలను తొలగించివేయగలము. ఈ కృషి మన దేశంలో నిర్విఘ్నంగా జరుగుతున్నది అన్న విషయం అందరికీ తెలిసినదే. అక్షరాస్యులు, నిరక్షరాస్యులు తమ తమ భాషలద్వారా ప్రగతి మార్గంలో తొందర తొందరగా పురోగమిస్తున్నారు. అందుకు ఎన్ని ఉదాహరణలనైనా మనం చూపించవచ్చును.

ఒకప్పుడు మనదేశంలో ఇంగ్లీషులో మాట్లాడడం, కవిత్వం వ్రాయడం ఉదాహరణలు ఇవ్వడం, నాటక ప్రదర్శనలు చేయడం మొదలగునవి అభివృద్ధికి, విద్యుత్తుకు చిహ్నములని భావింపబడేది. ప్రస్తుతం ఆస్థితి మారిపోతూ ఉన్నది. సాంస్కృతిక కార్యకలాపాలలో ఇంగ్లీషును మాధ్యమంగా చాలా తక్కువమంది ఉపయోగించాలని కోరుతున్నారు. కొంతమంది ఈనాడుకూడా ఇంగ్లీషుద్వారా పనులను జరుపుతున్నారంటే అది అశక్తతవల్లనే గాని ప్రేమవల్లకాదు. మన ప్రాంతాలలోని శాసనసభలలో ప్రాదేశిక భాషలకే ప్రాముఖ్యత హెచ్చుతున్నది. అయిననూ మన రాజ్యాంగ యంత్రం ఇంగ్లీషులోనే ఎందువల్ల నడుస్తున్నదీ అంటే ఆ యంత్రాన్ని నడిపించేవారు ఇంగ్లీషులో శిక్షితులై ఉండడమే అందుకు కారణం. నిజానికి ఈ యంత్రచాలకులు జనసామాన్యంయొక్క ప్రయోజనంకొరకు ఈ యంత్రాన్ని నడిపిస్తూఉంటే ప్రజలభాషలోనే యంత్రాన్ని నడిపించకతప్పదు. ఇది ఎవరాపిననూ ఆగునది కాదు. భాషవ్యవహార సాధనమేకాక ప్రేమభావాన్ని చూరగొనుటకుకూడా సాధనమే. రాజ్యాంగాన్ని నడిపించువారిలోనూ, పౌరులలోనూ పరస్పర ప్రేమభావం పెరుగుతేనే గాని ప్రజాస్వామ్యం అభివృద్ధికి రానేరదు.

ప్రస్తుతం మొత్తం భారతదేశంలో రాజకీయ నిర్వహణకు సంబంధించినంతవరకు ఇంగ్లీషుభాషకు ఏకాధిపత్యం లభించి ఉన్నది. అయితే ఆ భాషకు అన్ని ప్రాంతాలలోనూ ఒకేరూపం వ్యాప్తిలో ఉన్నది. అందువల్ల ఇంగ్లీషును దృష్టిలో పెట్టుకొని మన భాషలనుగురించి ఆలోచించినప్పుడు అదే విషయం మనకు జ్ఞాపకానికి వస్తూ ఉంటుంది. అందువల్లనే ఇంగ్లీషు తొలగిపోతే సరిగా అదే స్థానంలో ఇంకొక భాషను ప్రతిష్ఠించవలయునను ఊహ మనకు కలుగుతున్నది. దానికి రాజ్యాంగ యంత్రాన్ని నడిపించు వారి భాషాశక్తికూడా కొంతవరకు కారణభూతమవుతున్నది. ఈ సందర్భంలో భాషాసమస్యనుగురించి ఆలోచించేటప్పుడు దేశంలోని జనసామాన్యం యొక్క స్థితినీ, వారి విద్యకు సంబంధించిన యోగ్యతలనూ కార్యశక్తినీ దృష్టిలో పెట్టుకొనవలయును-అన్న విషయాన్ని మనం మరచిపోతున్నాము. భారతీయ సంఘ రాజ్య కార్యక్షేత్రం భారతదేశంలోని విభిన్న భాషా రాజ్యాలకు సంబంధించిందన్న విషయాన్ని కూడా మనం మరచిపోతున్నాము.

మనదేశాన్ని భాషాప్రయుక్తంగా విభజిస్తే హిందీకి నాలుగుప్రాంతాలు, లభించగలవు. మిగిలిన ప్రాంతాలు పది భాషలలో విభజింపబడగలవు. దక్షిణ దేశంలోని నాలుగుభాషలు అనగా తెలుగు, తమిళం, మళయాళం, కన్నడం

రాజ్యభాషలుగా తమతమ ప్రాంతాలలో నెమ్మది నెమ్మదిగా వ్యాపిస్తున్నవి. ఒరియా, బెంగాళీ, అస్సామీ భాషలు తూర్పు భారతదేశంలో వృద్ధిపొందు తున్నవి. పశ్చిమరాష్ట్రమైన బొంబాయి ప్రాంతంలో గుజరాతీ, మరాఠీ భాష లను తగిన స్థానము లభింపజేయడానికి ప్రయత్నం జరుగుతున్నది. కాశ్మీరంలో ఉర్దూ, కాశ్మీరు భాషలు రెండూ ఉపయోగంలో ఉన్నవి. నాలుగు హిందీ ప్రాంతాలు అనగా ఉత్తరప్రదేశం, బీహారు, రాజస్థానం, మధ్యప్రదేశ్ హిందీని రాజభాషగా స్వీకరించినవి. ఈ రాజ్యాలన్నింటి శాసనసభల భాష ఆయా ప్రాంతాలలోని ప్రాదేశిక భాషయే. ఈ ప్రాంతాలలో ఇంగ్లీషు నెమ్మది నెమ్మదిగా కార్యాలయముల భాష మాత్రమే అయిపోతున్నది. తమ భాషే ప్రాంతీయ ప్రభుత్వముల భాష కావలయునని జనసామాన్యం రోజురోజూ ఆందోళన చేస్తున్నది. అన్ని ప్రాంతీయ ప్రభుత్వాలు అందుకు శక్తివంచన లేకుండా ప్రయత్నం చేస్తున్నవి. కనుక ఇకముందు ప్రాదేశిక ప్రభుత్వ నిర్వ హణకు ఇంగ్లీషు రాజభాషగా ఉంటుందనేది అసంభవమైన విషయం. దాని స్థానాన్ని ప్రాంతీయ భాషలకు వదిలి ఇంగ్లీషు తొలగిపోతుందనడంలో ఏ విధ మైన సందేహంలేదు. ఇది దానంతటదిగానే జరిగేపని. అందుకు వివాదాలు అవ సరం లేదు. కాకపోతే రాజ్య కార్యకలాపాలలోనూ, అంతర్జాతీయ వ్యవహా రాలలోనూ ఈనాడు ఉన్న ఇంగ్లీషు తొలగిపోతే ఆ స్థానం ఏభాషకు లభించ వలయును? అన్నదే ఈనాటి మన సమస్య. ఆ స్థానం ఏ భాషకు లభించినా ఆ భాషను శక్తివంతముగా రూపొందించేది ఎవరు? అట్టిభాష ఏవిధంగా వృద్ధిచెంద వలయును ? ఎట్టి శక్తి కలిగిన భాష భారతీయ సంఘ శాసనభాష కాగలదు? ఆ భాషకూ ప్రాదేశిక భాషలకూ పరస్పరం ఎట్టి సంబంధం ఉండవలయును? ఆదానప్రదాన కార్యక్రమం ఏ విధంగా ఉండవలయును ? భాషలన్నింటి వృద్ధి దేశ సాంస్కృతిక ఉన్నతి మార్గంలో ఏ విధంగా ప్రతిబింబించవలయును ? ఈ ప్రశ్నలన్నింటినీ గురించి మన పార్లమెంటు సభ్యులు ఆలోచించి 351 వ సూత్రం రూపంలో దేశానికి ఒక మార్గాన్ని ప్రసాదించినారు. "హిందీ భాష యొక్క విస్తృతిని పెంపొందించుటయు ఇండియా యొక్క మిశ్రిత సంస్కృ తికి చెందిన అన్ని అంశములకు భావప్రకటనా సాధనముగ ఉపకరించునట్లు దానిని అభివృద్ధిచేయుటయు, మరియు దాని ఆత్మీయతకు భంగముకలుగకుండ, హిందూస్థానీలోను ఎనిమిదవ అనుసూచియందు నిర్దిష్టమైయుండు ఇండియా లోని ఇతర భాషలలోను ప్రయోగింపబడు రూపములను, శైలిని, నుడికారము




లను స్వీకరించియు మరియు అవసరమైనప్పుడు లేక వాంఛనీయమైనప్పుడు దాని పదజాలమునకు గాను ప్రధానముగ సంస్కృతమునుండియు ఆపైన ఇతర భాషలనుండియు పదములను సేకరించియు దాని వికాసమును చేకూర్చుటయు, సంఘము యొక్క కర్తవ్యమై యుండవలెను."

భారత రాజ్యాంగవిధానంలోని ఎనిమిదవ అనుసూచీలో ఉల్లేఖింపబడిన భారతీయ భాషలు :— 1. హిందీ 2. తెలుగు 3. మరాఠీ 4. తమిళం 5. కన్నడం 6. బెంగాళీ 7. గుజరాతీ 8. ఒరియా 9. పంజాబీ 10. మలయాళం 11. అస్సామీ 12. ఉర్దూ 13. కాశ్మీరం 14. సంస్కృతం.

ఇది రాజ్యాంగవిధానంలోని 17 వ అధ్యాయంలో పొందుపరుపబడి ఉన్నది. 17 వ అధ్యాయంలోనే మొదటి సూత్రం ఇది 'సంఘ రాజభాష హిందీ, లిపి దేవనాగరి' ఈ రెండుసూత్రాలను కలిపి చదివినయెడల భారతీయ రాజ్యభాష యగు హిందీ వృద్ధికి, వికాసానికి తోడ్పడుట భారతప్రభుత్వ కర్తవ్యం అన్న విషయం బోధపడగలదు. ఈ వికాస కార్యక్రమంలో 8 వ పట్టికలో ఉల్లేఖింపబడిన భారతీయ భాషల రూపం, శైలి, శబ్దావళిని దానిలో కలుపుకొంటూ దాని వృద్ధిని పొందించడం కూడా భారతప్రభుత్వం యొక్క కర్తవ్యం కాగలదు. ఈ సూత్రాన్ని అనేకమంది అనేక విధాలుగా వివరించి ఉన్నారు. ఈ 8 వ పట్టికలో ఉల్లేఖింపబడని భాషలు హిందూదేశపు భాషలు, అందులేని భాషలకు గౌరవం లేదు. అందువలన కొన్ని భాషలను ఇప్పుడైననూ జోడింపబడవలయునని కొంతమంది అభిప్రాయం. ఇందు పొందుపరుపబడిన భాషలనే ప్రభుత్వం హిందూదేశపు భాషలుగా అంగీకరింపబడగలదనీ ఇతర భాషలకు ఎట్టి గౌరవం లభించదనీ వారి అభిప్రాయం. ఇది నిరాధారమైనదే గాక తప్పుకూడాను. 350వ సూత్రంలో భారతీయపౌరులు భారతప్రభుత్వంతో ఏ భాషలోనైననూ ఉత్తరప్రత్యుత్తరములు జరుపవచ్చునని నిర్ణయింపబడినది. కనుక 8 వ పట్టికలో వివరింపబడని భాషలకు రాజభాషా వికాసానికి ఘనిష్టమైన సంబంధం కలదని మాత్రమే దాని అర్థం. ఇదే సందర్భంలో ఇంకొక విషయాన్ని ఉన్నది. ఎనిమిదవ పటికలో ఉల్లేఖింపబడని హిందూస్థానీని కూడా హిందీ తనతో కలుపుకొనవలసిఉన్నది. హిందూస్థానీ అనే భాషను ఏ ప్రాంతం తనకు రాజభాషగా చేసుకొనలేదు. 8 వ పట్టికలో ఉల్లేఖింపబడిన 14 భాషలలో సంస్కృతాన్నివదిలిపెట్టి మిగతా భాషలన్నీ భారతదేశంలోని అన్ని ప్రాంతాలలో అధికారపూర్వకమైన రాజ

భాషలుగా అంగీకరింపబడినవి. ఈ భాషలన్నీ తమతమ ప్రదేశాలలో అభివృద్ధిని పొందుతున్నవి.

హిందీకూడా ప్రాదేశిక భాషగానూ రాజభాషగానూ నాలుగు ప్రాంతాలలో వికసిస్తున్నది. అట్టిస్థితిలో, హిందీ ప్రాంతములో వ్యాపించి రాజభాషా రూపంలో వృద్ధిపొందిన హిందీయే భారత రాజభాష అవుతుందా? లేక ప్రాదేశిక హిందీకంటె భిన్నమైనది రాజభాష అవుతుందా? అన్న ప్రశ్న ఉదయిస్తుంది. 351 వ సూత్రం అందుకు జవాబు చెపుతున్నది. మొత్తం రాజ్యాంగ చట్టంలో ఏ హిందీ వర్ణించబడి ఉన్నదో అది రాజభాష రూపంలోనే ఉన్నది. విభిన్న ప్రాంతములలోనూ, కేంద్రప్రభుత్వ కార్యాలయములలోనూ ఉపయోగింపబడే హిందీయే అక్కడ వర్ణింపబడినదన్నమాట. అది వృద్ధిపొందినప్పుడు, భారతదేశంలోని సమ్మిశ్రిత సంస్కృతిని వ్యక్తం చేసినప్పుడు తన వైశిష్ట్యాన్ని పోగొట్టుకొనకుండా హిందూస్థానీని, ఎనిమిదవ పట్టికలో ఉల్లేఖింపబడిన 13 భాషలలోని శబ్దములనూ తనలో కలుపుకొన్నప్పుడు ముఖ్యంగా అవసరమును బట్టి సంస్కృతములోనుండీ, గౌణముగా ఇతర భాషలలో నుండీ శబ్దాలను గ్రహించినప్పుడు అది రాజభాష అవుతుంది.

రాజభాష హిందీ సంస్కృతములోనుండీ ఇతర భాషలోనుండిగూడా అవసరమునుబట్టి శబ్దాలను గ్రహించవలయును అనేదానిని మనం ముఖ్యంగా జ్ఞాపకముంచుకోవాలి. హిందూస్తానీని కూడా కలుపుకొని 14 భాషలతో విలీనం కావాలి. అనుదానిని కూడా జ్ఞాపకముంచుకోవాలి. దీనికి అర్థం ఏమిటంటే అవసరమునుబట్టి మాత్రమే సంస్కృతంలోనుండీ. గౌణముగా ఇతర భాషలలోనుండీ శబ్దాలను స్వీకరించేపని కేవలం హిందీమాత్రమే కాక ప్రాదేశిక భాషలన్నీ కూడా చేయవలసి ఉంటుంది. హిందీ ప్రాదేశికభాషగా తానున్న ప్రాంతాలలో వృద్ధి పొందుతుంది. అదేవిధంగా ఇతరప్రాంతాలతో ఇతర ప్రాదేశిక భాషలుకూడా వృద్ధిని పొందగలవు. ఈ బాధ్యతను భారత ప్రభుత్వం తాను వహించవలసి ఉంటుంది, హద్దులు కలిగిన క్షేత్రంలో ఈ పని చేస్తున్నప్పుడు అక్కడ ఏకరూపత్వాన్ని సాధించేపనిని భారతప్రభుత్వం ముందు చేయవలసి ఉంటుంది. అందుకు ప్రాంతీయ ప్రభుత్వాల సహకారాన్ని అది పొందవలసి ఉంటుంది. హిందీని రాజభాషా సింహాసనముపై అధిష్ఠింపజేసి తరువాత 351 వ సూత్రం ప్రకారం దానిని వృద్ధిలోనికి తీసుకొనిరావాలి. రాజభాష హిందీ వికాసానికి, 351 వ సూత్రానికి వేరువేరు అర్థం చెప్పినట్లయిన

ఆ సూత్రం యెడల అన్యాయం చేసినట్లవుతుంది. ఈనాడు హిందీకి వ్యతిరేకంగానూ, అనుకూలంగానూ జరుగుతూఉన్న గందరగోళాన్ని చూస్తే హిందీ యొక్క బృహత్స్వరూపాన్ని చూడక, సంపూర్ణ భారతీయతా స్వరూపంలో హిందీని దర్శించక అంశముగా ఉన్న దానిని సంపూర్ణమని అనుకొన్నందువల్లనే ఆ గందరగోళం అంతా అని తేలుతున్నది. కొంతవరకు రాజభాషా కమీషన్ ఈ విషయాన్ని స్పృశించింది. పార్లమెంటు హిందీ సమితికూడా ఈ విషయమై ఎక్కువ ధ్యానం ఉంచినట్లయితే దేశం ఆ నివేదికను పూర్తిగా అంగీకరిస్తుంది. అంతేగాక ఇంగ్లీషును కాంక్షించేవారి వాదప్రభావం కొద్ది క్షేత్రంలోనే పరిమిత మవుతుంది. ప్రాదేశికభాషలకూ, హిందీకీ మధ్య ప్రస్తుతం అధికారానికి సంబంధించిన అన్యాయపూర్ణమైన విభజన ఉన్నదనడానికి సరిఅయిన ఆధారం లేదు.

రాజభాష అనగా అర్థం ఏమిటో కనీసం అది అయినా స్పష్టంగా తేలలేదు. రాజభాష జనసామాన్య భాష. ఈ రెండింటికీ ఉన్న సంబంధం ధర్మ సూత్రాలకూ మహాభారతమునకూ గల సంబంధం వంటిది. రాజభాష వెన్న అయితే జనసామాన్యం భాష పాలవంటిది. పాలను చిలికినగాని వెన్న దొరకదు. పాలలోనుండి ఉత్పన్నమైనది కనుక ఏ వ్యక్తి ఎన్ని పాలు తాగుతాడో అంత వెన్నను తినలేడు. చాలామంది పాలతోనే తమ పనిని నిర్వహించుకొంటారు. కొంతమందికి వెన్న, నేయి ఎక్కువ అవసరం. జనసామాన్య భాషలను మథించగా వెలువడిన శబ్దాలను ప్రజాస్వామ్య విధానాన్ని నడుపుటకు ఉపయోగించవలయును. ఆ శబ్దాలనే మనం రాజభాషలో ఉపయోగించుకొనగలము. ఆ శబ్దములే పాలలో వ్యాపించి ఉన్న వెన్నవలె ఉపయోగింపపడగలవు. ఆ శబ్దములు ఏ ప్రాంతంనుండి వచ్చినవో గమనించవలసిన అవసరం ఉండదు. నామరూపముల భ్రమలో పడి ఆ శబ్దముల సార్వదేశిక స్వరూపాన్నీ, విస్తారమునూ అడ్డుకొనేవారు జాతీయతను కాంక్షించేవారు కాదని స్పష్టంగా చెప్పవచ్చును. ఈ మంథన కార్యక్రమం పూర్తికాక పూర్వమే ఈ కవ్వం నాదీ నాదీ అని పోట్లాడితే కుండ చిట్లిపోతుందే కాని వెన్న లభించదు. కనుక ఈ కార్యకలాపములను నిర్వహించడంలో సహనశీలురమై సంయమంతో [illegible] వ్యా[illegible]ంచడం చాలా అవసరం. [illegible] నన్నిటినీ వ్యక్త[illegible] మంత్రం ఒకటి ఉన్నది. భారతప్రభుత్వ భారతీయ రాజభాషాభివృద్ధికి తోడ్పడుటకు ముందు ప్రాంతీయ రాజభాషల వృద్ధికికూడా కృషి జేయవలెను. ఇలా

అభివృద్ధిని సాధించినకొద్దీ కేంద్రప్రభుత్వ కార్యకలాపములలో భారతీయ హిందీని ప్రవేశపెట్టి సామాసిక (కంపోసైట్) సంస్కృతిని వ్యక్తీకరించే విధంగా దానిని రూపొందించవలయును.

దానితో ఈ పని ఎట్లు జరుగవలెను? దీనికి ప్రణాళిక ఏమిటి? అది ఎవరు చేయాలి? ఈ ప్రశ్నలన్నీ ఏర్పడతవి. ఇది రాజ్యాంగ యంత్రమును నడిపించేవారి పని అయిననూ దేశ సౌభాగ్యాన్ని కాంక్షించేవా రందరూ ఈ విషయమై తమ తమ అభిప్రాయాలను వెల్లడించడం అవసరం.

మనదేశం 13 ప్రాదేశిక భాషల మధ్య భాషాప్రయుక్తంగా విభజింపబడి ఉన్నది. ఆ భాష లన్నింటిలోనుండి ప్రవహించే అంతర్ధార దాదాపు ఒకటే. దేశం విశాలమై, రాకపోక సాధనాలు లేకపోవడంవల్ల ఆయా ప్రాంతాలలో భాషకు సంబంధించిన ఉచ్చారణ మొదలగువానిలో విభేదం కనిపించవచ్చును. దక్షిణదేశం లోనినాలుగు భాషలలో కొంత ప్రయత్నించిచూస్తే ఏకరూపంఉన్న శబ్దాలు ఎన్నో దొరకగలవు. బెంగాలీ. ఒరియా, అస్సామీ మొదలగుభాష లన్నింటిలోనూ ఇట్టిదానినే మనంచూడగలము. గుజరాతీ, మరాఠీలలోకూడ అదేచూడవచ్చును. ఉత్తర భారతదేశంలో ఉర్దూ, హిందూస్థానీ, సంస్కృతభాషల ప్రభావం ఉండనే ఉన్నది. దీనినిబట్టిచూస్తే మనదేశం నాలుగు భాగాలుగా దానంతటదే కనపడగలదు. ఈ నాలుగుభాగాలలోని శబ్దభాండారాన్ని పరస్పర ఉపయోగం కొరకై పెంపొందించి ఆ పెంపును సంఘభాష హిందీకికూడా లభించునట్లు చేయవచ్చును

స్వరాజ్యం లభించినతర్వాత దేశ పునర్నిర్మాణానికై ప్రణాళికా సంఘము నొకదానిని మనం నిర్మించాము. ఆ సంఘం చూపించిన బాటలో ఈ నాడు దేశంఅంతా నడుస్తున్నది. అందుకు ద్రవ్యోల్బణభయాన్ని కూడా మనం వదలిపెట్టాము. కోట్లరూపాయలను ఖర్చుపెడుతున్నాము. ఇది అంతా ప్రజాశక్తిని పెంపొందించడానికి జరుగుతున్నది. దాని వలన ఆర్థికశక్తి పెంపొందగలదని మనం అనుకొంటున్నాము. అట్టిస్థితిలో వారి భాషలద్వారా కూడా వారు ముందంజ వేయునట్లు చేయుటకు మీనమేషాలు లెక్కపెట్ట వలసిన అవసరం ఏమున్నది? దేశ జనసంఖ్యలో ఒక వంతుకూడాలేని, తెలివి గలవారమనుకొనే వారిభాషద్వారా మన పనులను నడుపుటకు మనం ఎందుకు ప్రయత్నం చేస్తున్నాము? భారతీయ భాషాపురుషునికి తన స్వస్వరూపజ్ఞానం కలుగగపోవడమే అందుకు కారణం. శరీరములోని ఏదోఒక అవయవమును

పూర్తి శరీరంగాభావించి ఇతర అవయవములు ఎవరివో అయినట్లు తనవికానట్లు భావించడంవల్ల తగాదాలు వస్తున్నవి. మన భాషలకు సంబంధించి గానీ మన సంస్కృతికి సంబంధించిగానీ ఒక ప్రణాళిక, ఒక కార్యక్రమం అనేది మన ముందులేదు. ఈ ఈపని తొందరగా జరగవలసిఉన్నది. అందుకు అవసరమైన ప్రణాళికలు సిద్ధంకావలసి ఉన్నవి.

ఇంగ్లీషును కూడా 14 భాషలతోపాటు 15 వ భాషగా చేర్పించుటకు వివాదాలు జరుగుతున్నవి. భారతదేశంలోని భాషాసమస్యకూ ఈ వివాదానికీ ఎట్టిసంబంధంలేదు. మన భాషాసమస్య అంతకంతకూ జటిలంకావడానికీ ఈ వివాదం ఉపయోగపడుతుంది. మనముందు అఖిలభారతీయ స్వరూపం గలిగిన సమస్యలు ఎన్నోఉన్ననూ మన సమస్యలను మనం ఉపేక్షించుటకు వీలులేదు. ఈనాడుకూడా హిందీప్రచారకులు పెద్ద జమీందారునికి బంధువులవలె దీనులుగానే ఉన్నారు. సూర్యవంశ క్షత్రియులమని భావించి మన ప్రచారకులు చిన్న చిన్న పొలాలలో వ్యవసాయంచేస్తూ ఆకులు, అలములు అమ్ముకొంటున్నారు. అధికారంలో ఉన్న నాయకులు పెద్దయింటికి చెందినవారని మాత్రమే భావించి వారిని గౌరవిస్తున్నారు. హిందీ ప్రచారకులకు గాంధీమహాత్ముని ఆశీర్వాద బలం ఉన్నది.

దేశంలోని నాయకుల సాన్నిధ్యంలో ఉండే సౌభాగ్యం లభించిననూ అయిననూ వారి బీదతనం మాత్రం తొలగిపోలేదు. ఇంగ్లీషు ఉపాధ్యాయునికి లభించు గౌరవం తమకుకూడా లభించగలదనీ, అట్టిరోజులు తమకూ రాగలవనీ ఆశపెట్టుకొని హిందీ ప్రచారకులు జీవిస్తున్నారు. ఇతర శక్తులమీద ఆధారపడి మనం శక్తిమంతులం కాగలమా : కనక మనంకూడా మన శక్తిని పెంపొందించుకోవాలి, మన కార్యశక్తి, మన జ్ఞానశక్తి పెరగనంతకాలం మనం ఈ మహత్తర కార్యాన్ని ఒడిపించుటకు తగిన ప్రతినిధులం అనిపించుకోలేము.

సాధారణంగా హిందీవల్ల లభించిన జ్ఞానం చాలుననే భావం చాలమంది ప్రచారకులలో కనిపిసూ ఉన్నది. ...భివృద్ధి

హిందీ ప్రచారకులు ఇటు ప్రాదేశిక భావం అటు భారతీయ భావం రెండింటిలో సమన్వయాన్ని తీసుకొని రావాలి. ఒక ...నిలోని మంచిని ఇంకొకదానిలో ప్రవేశపెట్టుటకు కృషి చేయాలి. ప్రజలసేవ చేయడానికి ప్రాదేశిక భాష మాధ్యమం అయితే భారతీయతా సేవకు హిందీ మాధ్యమం.

గడిచిన పది సంవత్సరాలలో హిందీ కొరకు ప్రభుత్వం చేసిన పని లెక్కింప దగినదిగాలేదు. ప్రజలలోనుండి ఆందోళనలేనిదే ప్రభుత్వం ఏమి చేయగలదు ? ప్రభుత్వానికికూడా మార్గాన్ని చూపించు బాధ్యతను మనం వహించవలసి యున్నది.

ప్రచారక ప్రతినిధులకు, ఆహ్వాన సంఘంవారికి నాకీ అవకాశం కల్పించి నందులకు నా కృతజ్ఞతను తెలుపుకొంటున్నాను.

## గ్రంథ స్వీకారము :

| | |
|---|---|
| భ్రమర గీతలు | శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తి |
| ఆంధ్ర భారతి | శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి |
| మధుర భారతి | |
| అభిషేకము | |
| మధుర సంక్రాంతి | |
| గీతామాత | శ్రీ సదానంద |
| శ్రీమద్భగవద్గీత | శ్రీ పురాణపండ రామమూర్తి |
| గోపూజ | |
| శ్రీరామ స్తుతి | |
| మృత్యుంజయ స్తోత్రం | |
| విశ్వశాంతి | |
| శ్రీ శివస్తోత్రాలు | |
| శివానంద లహరి | శ్రీ రోహిణి |
| వివిధ గీతములు | కళా కల్లోలినీ గ్రంథమాల |
| నన్నెచోడుని కవిత్వము | శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ |
| వెట్టి చాకిరీలు | శ్రీ దంగేటి రామచంద్రరావు |
| వరకట్నాలు నిషేధించండి | శ్రీ ప్రభాకర శ్రీకృష్ణ భగవాన్ |
| వరకట్నాలు ఎందుకు నిషేధించాలి | శ్రీ తలగడదీవి శ్రీరామారావు |
| కురుక్షేత్రం | హిందీ:- శ్రీదినకర్ |
| | తెలుగుసేత:- శ్రీ చావలి రామచంద్రరావు |
| కృష్ణకథా విపంచి | శ్రీ ఖాడాల రామకవి, M. A. |

కవిత :

# పిపృచ్ఛ

—శ్రీ వంగల పార్థసారథి ఆచార్యా

ఎవఁ డతఁ డెవ్వఁ డాత డతఁ డెవ్వఁ డెవండు భవత్కవిత్వ మం
దవిరత గీయమానుఁ డగునంచు జనుల్ నను బృచ్ఛసేయఁగా
ఎవరని విన్నవింతు ప్రభు ? ఈవు సమీపమునందె కూరుచుం
డువనియు, నవ్వుమోమున ననుం బరికింతువటంచుఁ బల్కెదన్ ! ...

అంతియే కాని సామివృత్తాంత మెఱుగ !
తన్మధుర దరహాస సౌందర్యరోచి
సోకి పులకింతు ! ఉబుకు నశ్రువుల నిలుతు !
వెఱ్ఱిమొఱ్ఱిపదము లాలపించుకొందు !!

నిజముగ నే నెఱుంగ నతనిన్ – క్షమియింపుడటన్న వార ల
క్కజపడి – నమ్మజాలక – అఖండరసస్ఫుట భక్తిభావనా
భజిత రహో మహోజ్జ్వలత వర్ణితమై అనుబింబితమ్మగున్
త్రిజగదలభ్య దివ్యతనుతేజ ! మ దెవ్వరి దంద్రు క్రమ్మఱన్ !....

ఆతఁ డెవ్వ ? డెవం డాత ? డంద్రు వార;
లేమొ ! ఎఱుగ నటంచు వచింతు నేను !
ఆగ్రహోదగ్రు లగుచు న న్నరసి యరసి
యేగెద రకారణముగ నిందించుకొనుచు !! ....

నా యావేదన లాలపించుకొనకుండం జాల కే మేమియో
వ్రాయంబూనెద – వారలున్ మఱొకపర్యాయమ్ము నం జీరుచున్
నాయర్థాల్ వివరింపుమం చడుగ, దైన్యంబంది – వ్యాఖ్యానముల్
సేయంజాలక – వ్రాతలట్టులె సమర్పింతుం బ్రజాకోటికిన్ !!

ఇతఁ డొక పిచ్చివాఁడు ! – విలిఖించెడు నర్థవిదూరవృత్త సం
తతు లని పల్కి నా ప్రజలె న న్నవహేళన మాచరించి, శా
శ్వతముగ నుజ్జగించెదరు సామి ! కళాకలశాబ్ధి గూఢ ర
త్న తతి రుచి ప్రదీప్తచరణా !! యిదియేమి ? ఘృణాఘనాఘనా

ఇంత అరయుచు నీవు హసించుచుండ
ఈ రస వ్యసనము సన్యసించు టెట్లు ?
ఈ పిపృచ్ఛాభర మపనయించు దాఁక
కరఁగి ప్రవహింతు నొక బాష్పఝరిగ నిట్లు !! ....



పుస్తకసమీక్ష :

## సింహబలి

రచయిత : శ్రీ మోటూరి వెంకటరావు, B, A.
మూల్యం : 2-0-0

ప్రాప్తిస్థానం : M. S. R. murthy & Co.
విశాఖపట్నం.

జిజియాబాయి పనుపున శివాజీ సింహగడమును పట్టుకొనుటకు తానాజీని నియోగించుట, తానాజీ హతుడయ్యును దుర్గమదుర్గము సాధించుట-ఇందలి ఇతివృత్తము.

ఇదియొక స్వతంత్రమైన కావ్యము. ఒకేవిధముగ మొదలనుండి తుదివఱకు నిర్వహింపబడినది. ఆధునిక కావ్యములలోనిది యొక ఎన్నదగిన మణి.

## పంచకల్యా

రచయిత :
డాక్టర్. యస్వీ జోగారావు.
M. A. PH. D.
ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు.

మూల్యం :
రు. 1-50.

ఆంధ్ర రచయితల సంఘంవారు ఈ గేయ పద్య సంపుటాన్ని ప్రకటించారు. శ్రీ రాజా బొప్పరాజు రామకృష్ణరాజుగారు కృతి పొందారు. డాక్టర్ బి. రామరాజు M. A. PHD గారు భూమికలో రచయితను ప్రశంసిస్తూ సనాతనాధునాతన కవితా ప్రక్రియలందు గడదేరిన పిల్లవస్తాదు" అన్నారు.

శ్రీ విశ్వనాథవారు "వీరి కలము పూర్వాధునికములైన రెండు సంప్రదాయ మార్గములలోను నిరాఘాటముగ నడిచినది. ఎక్కువ భాగము వీరి అభిరుచి ఆధునిక కవుల మార్గమునందె యున్నట్లు తోచును. వీరి కవితాశక్తి ప్రశంసనీయముగ నున్నది." అన్నారు.

ఇంకా పలువురు పండితులూ కవులూ ప్రశంసించిన, ఆకర్షకంగా ముద్రింపబడిన గ్రంథం. సాహిత్య పిపాసువు లవశ్యముగ పఠింపదగినది.

—సుబ్బరామశాస్త్రి

## హోమ్ సినిమా ప్రొజెక్టర్



మీ ఇంటి వద్దనే చేత్తో మోసుకొని వెళ్ళడానికి వీలయిన ఈ పోర్టబుల్ ప్రొజెక్టర్‌తో సినిమాను చూసి ఆనందించండి. టార్చి లేక విద్యుచ్ఛక్తితో దీన్ని పనిచేయించవచ్చు. మామూలు 35 మి. మీ. ఫిలిమ్‌ను ఇందులో ఉపయోగించవచ్చు. 4'×4' పూర్తి సైజులో తెరమీద వర్ణచిత్రాలు, సంఘటనలు, నృత్యాలు వాటంతటవే చలిస్తూ ఉంటాయి. 10 అడుగుల ఫిలిమ్, నడిపే విధానం, సచిత్రంగా తెలిపే కరపత్రం ఉచితం. స్పెషల్ డీలక్స్ రకం రు. 15-50. వి. పి. చార్జీలు రు. 4-50. అదనపు ఫిలిమ్ గజానికి 0-50 నయాపైసలు. రిఫైన్డ్ స్క్రీన్ రూ. 3.

## (డీలక్స్) ఆటోమేటిక్ యాభై గుండ్ల పిస్టల్
### (లైసెన్సు అక్కరలేదు)

ఆటోమేటిక్ యాభై గుండ్ల రిపీటెడ్ డయల్‌తో అమర్చబడిన ఈ అమెరికన్ పిస్టలు పెద్దధ్వని, మంటలు కల్గించి దోపిడిగాళ్ళనూ, అడవి మృగాలనూ పారద్రోలుతుంది. సినిమా, డ్రామా నటులకు చాలాఅవసరం శత్రువుల బారి నుండి రక్షించటంలో గొప్ప సహాయకారి. ఖరీదు రు. 10-50. వి. పి. చార్జీలు రు. 2-50. 25 గుండ్లు ఉచితం. అదనపు గుండ్లు డజన్ రు. 1. మేలైన పిస్టల్ కేసు ఒక్కొక్కటి రు. 3-00. రిపేరుచేయటానికి ఫ్యూయల్ ఆయిల్ రు. 1.




*సాంకేతిక పుస్తకాలు:* మీకు సంపూర్ణ సంతృప్తిని ఇచ్చే హామీ ఇవ్వగలం

ఎలక్ట్రిక్ అండ్ రేడియో గైడ్: రు. 15 లతో మీరు స్వయంగా రేడియోను తయారుచేసుకోండి. రేడియో రిపేరి, వైరింగ్, విద్యుచ్ఛక్తికి సంబంధించిన సమస్తమూ 117 బొమ్మలతో బోధించే ఈ సరికొత్త ప్రచురణ వెల రు. 5. వి. పి. చార్జీలు రు. 1.

భాషా బోధిని: జాపనీస్, చైనీస్, తమిళం, మలయాళం, బెంగాలీ, జర్మనీ ఇత్యాది దేశ విదేశ భాషలు నేర్పించే ఈ పుస్తకం ఖరీదు రు. 5. వి. పి. చార్జీలు రు. 1.

*దర్జీపని కట్టింగ్ రు. 4. సబ్బుల తయారీ రు. 3. ఫోటోగ్రఫీ రు. 3. సువాసనవస్తువుల తయారీ రు. 1-50. ఒకనెలలోనే హిందీ నేర్చుకోండి రు. 4*

[1 నుండి 3 పుస్తకాలవరకు వి.పి. చార్జీలు రు. 1-25] [ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులో]

**Anand Industries, Sasni Gate, Aligarh (INDIA)**